బాలానంద

# శ్రీకాళహస్తి మహాత్మ్యం

నాగశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ ...................... విజయవాడ-2

ప్రథమ ముద్రణ
1986

ముఖచిత్రం:
వి. యస్. ప్రకాష్

ప్రచురణ :
నవరత్నా బుక్ సెంటర్
ఏలూరు రోడ్, విజయవాడ-2

ముద్రణ :
"వెంకటరత్నా"
విజయవాడ-2

వెల : రు. 10-00

# విషయసూచిక

గాలినుండి అగ్ని రూపొందింది. అగ్ని అనే నిప్పు నుండి జల మావిర్భవించింది. జల మనే నీటినుండి పృధివి బయల్పడింది. పృధివి యను భూమిమీద ఓషధులు, జీవరాసులు, మొదలైన వన్నీ పుట్టాయని ప్రళయాంతర సృష్టి క్రమం మనకు చెబుతూంది.

ఒకదాని తరువాత యింకొకటిగ అవతరించిన యీ ఆకాశం, గాలి నిప్పు, నీరు, నేలలవి పంచభూతాలు. ఈ పంచభూతములలోను శివలింగాలు వెలిసినై. ఆ పంచలింగాలకు పృధ్విలింగం, జలలింగ జ్యోతిర్లింగం, వాయు లింగం, ఆకాశలింగాలనే పేర్లు. వానిలో పృధ్విలింగం శివకంచిలోను-జల లింగం జంబుకేశ్వరంలోను-జ్యోతిర్లింగం అరుణాచలం లోను-వాయులింగ మీ శ్రీకాళహస్తిలోను-ఆకాశలింగం చిదంబరంలోను క్షేత్రపాలకులై ప్రసిద్ధిగాంచినై. కర్పూరపు కాంతి కలిగి వాయులింగ మనంబడు యీ శ్రీకాళహస్తీశ్వరుని ప్రభావం యింత అంత అనిచెప్ప నలవిగానంత గొప్పది.

పుణ్యస్థలమైన యీకొండ వేయి శిఖరములు కలిగి రాణించుచున్నది. ఈ క్షేత్రమున శ్రీకాళహస్తీశ్వరాలయమే గాక జ్ఞానప్రసూనాంబా దేవాలయము, కుమారస్వామి విద్యాపీఠము, కనకదుర్గాంబ యనబడు హస్తొత్త సాగరదేవీ నిలయము, అగస్త్య పర్వతము, ఆ అగస్త పర్వతము నంటి ప్రవహించుచున్న స్వర్ణముఖీనది, యింకా కొన్ని లింగములు, క్షేత్రములు తీర్థములు ప్రఖ్యాత వృక్షములు మున్నగు పుణ్యక్షేత్రముల చేత ప్రకాశించు చున్నందున నిది భాస్కరక్షేత్ర మనియు ప్రసిద్ధికెక్కింది.

# వాయుదేవునకు వామదేవు డిచ్చిన వరములు

ప్రపంచ ముదయించిన మొదటి రోజుల్లో వాయుదేవుడీ కర్పూర లింగాన్ని భక్తి శ్రద్ధలతో పూజించి అనేక వేల సంవత్సరాలు తపసు చేశాడు. ఆయన తపసు పండింది. వాయు లింగం నుండి సాక్షాత్కరించిన పరమేశ్వరుడు "వాయుదేవా! నీవు చలనం గలవాడ వయ్యును చలనం లేని భక్తితో నన్నింత కాలం ధ్యానించి చేసిన తపసు కానందించాను. భక్తుడవు కనుక నీకు కావలసిన వరాల నీయడానికి వచ్చాను. నీకు కావలసిన వరాలేమిటో కోరుకో—యిస్తా" నన్నాడు.

వాయుదేవుడు పొందిన ఆనందానికి అవధులు లేకపోయినై. "వామదేవా! అనుగ్రహించావా తండ్రీ! నీవు దయామయుడవు—ధర్మ స్వరూపుడవు. నిన్ను నమ్మిన వారికి నిక్షేపము వంటివాడవు. స్వామీ! నేనీ ప్రపంచమునందు లేని తావంటూ లేకుండగను, పరమాత్మ చందంబున ప్రతిజీవి యందు నేను ప్రధానమై యుండు లాగునను. మీ ప్రతిరూపమైన యీ కర్పూర లింగము నాపేరున పిలువబడునట్లు నాకు వరములను ప్రసాదింపు" మని దోసిలి పట్టాడు.

సాంబశివుడంతట సంతోషించి "ఓయీ! నీవభిలషించిన యీ మూడు వరములును కోర దగినవె. నీ యభిమతము ననుసరించి నీవీ ప్రపంచ మంతటను వ్యాపించి వుందువు. నీవులేక జీవరాశి బ్రతుక జాలదు. నాయీ లింగ

మికమీద నీపేరున వాయులింగమని ప్రఖ్యాతి గాంచి సమస్త సుర అసుర గరుడ గంధర్వ కిన్నెర కింపురుష సిద్ధ సాధ్వి నరముని వరులచేతను పూజ లందు కొన నున్న"దని వరములిచ్చి యదృశ్య మయ్యాడు.

నాటినుండి కాళహస్తి క్షేత్రమందలి కర్పూర లింగం వాయులింగ మను పేరున సమస్త లోకాల వారిచే పూజ లందుకుంటుంది. వాయు దేవుని పేర వాయురాణం వెలిసింది. రామాయణ భారతాలలో గూడ వాయు దేవున కొక గౌరవస్థానం దక్కింది. భూమిమీద తిరిగే జీవాలకు తిరగని జీవాలకు గూడ ప్రాణాధార మయ్యాడు. ప్రపంచం మీద యెటు చూచినా వాయుదేవున కాధిక్యత పెరిగింది. అదంతా శంకరుడిచ్చిన వరప్రభావమనే చెప్పాలి.

# అభిమాన తనయుడు - ఆంజనేయుడు

త్రేతాయుగం నాటిమాట—రామాయణం జరుగుచున్నకాలం. గౌతమ ముని గొప్ప తపస్సంపన్నుడు. ఆయనకు సాటిమునులలోనె గాక అటు దేవ తలలో, యిటు మానవులలో గూడ గౌరవస్థానముంది. బ్రహ్మదేవుని కుమార్తెయైన అహల్యను గౌతమునకిచ్చి వివాహం చేశారు. ఐతే కారణాం తరాలవలన అహల్యకు దేవేంద్రాంశతో వాలి, సూర్యాంశతో సుగ్రీవుడు కలిగాక అంజనియనే ముద్దుల కూతురు గూడ పుట్టి పెరుగుతూంది. ఒకా నొక సమయంలో గౌతమునికి అనుమానం వచ్చింది. అప్పుడొత పరీక్ష

పెట్టాడు. ఈకుమారు లిద్దరినీ యీనదిలో విసరివేస్తాను. వీరు నాకుమారులైతే మనుష్యాకారాలతోనే వుంటారు. కాకపోతే కోతిరూపాలు పొందుతా"రంటూ గౌతమీనదిలో పడవేశాడు.

నదినీదుకుంటూ వచ్చిన కుమారు లిద్దరూ కోతులయ్యారు.

అహల్య గుట్టు బట్టబయలంది.

గౌతమముని కోపం పట్టలేక వాలి సుగ్రీవు లిద్దరినీ "మీరు నాయెదుట లేకుండ కిష్కింధకుపోయి బ్రతకండి" అనిశాసించాడు. ఆయన కోపమంత టితో తీరలేదు. అంజనిని చూచి "నీతల్లి చేయుచున్న పొరపాటు నీవు చూచి కూడ నాకు చెప్పనందున శాశ్వతంగ గ్రుడ్డిదానవై పో"మ్మని శపించాడు. అంజని పెనిమిటి కేసరి. ఈసమయంలో ఆయన గూడ యేమీ చేయలేక పోయాడు. "ఇక నాగతేమిటి నాన్నా!" అని అంజని తండ్రిని వేడుకుంది. గౌతముని కప్పుడు కుమార్తెమీద దయకలిగినా ఆమె గ్రుడ్డితనాన్ని తప్పించ లేని పరిస్తితి యేర్పడింది. ఆయనాలోచించి "భోజన సమయానికి నీదోసిలో నొక పండుపడుతూంటుంది దానిని నీవుతిని జీవించుతూండు. నయాశీర్వచనం వల్ల నీకొక మహనీయుడైన కొడుకు పుడతా"దని చెప్పాడు.

అలాగా కొంతకాలం జరిగింది.

ఒకనాడు పార్వతీ పరమేశ్వరులు కైలాసం నుండి దిగివచ్చి భూసం చారం చేస్తూ వనమార్గాన పోతున్నారు. అప్పుడొక వానరమిధునం కామ క్రీడల ననుభవించడం చూచి వారి మనసులు చలించినై. ఇద్దరూ మర్కట రూపాలు ధరించి సంగమించారు. శివవీర్య మపుడు భూపతనం కాకుండ

వాయుదేవుడెత్తుకపోయి యాగ్రుడ్డిదాని దోసిలలోపడవేశాడు. తన చేతిలోని దాహారమే ననుకుని అంజని తినివేసంది. దానితో ఆమెకు గర్భం నిలిచింది. నవమాసాలు నిండినై. అంజనికి ప్రసవవేదన ప్రారంభమయింది. ఆమెయం దనురాగం గల వాయుదేవుడు కనలేక నొప్పులు బడుతూన్న ప్రియురాలిని విడిచిపోలేక పోయాడు—ఇంటిలో నుండి అడుగు బయట పెట్టలేదు.

ప్రపంచ మంతటా గాలి స్తంభించి పోయింది. చెట్టుచిగురాకు గూడ కదలడంలేదు. లోకాలన్నీ యుక్కిరి బిక్కిరి లయ్యాయి. అప్పుడింక బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, దేవతలు, మునులంతా వాయుదేవుని వెదికి కుంటూ వచ్చి "గాలిదేవా! నీవిలాగ కదలకుండ—మెదలకుండ కూర్చుంటే లోకాలకు లోకాలే నశించి పోవడానికి సిద్ధమయ్యాయి. నీవింకటనైన కదిలి ర"మ్మన మన్నారు. నాడు శంకరుడు తనకిచ్చిన వరప్రభావమెలాంటిదో వాయుదేవున కిపుడర్థమయింది. ఐనా వాయుదేవుడు చలించకుండ "నాప్రియు రాలు కనలేక బాధపడుతూంటె మీలోనెవరికి యేచీకుచింతా లేకపోయినపుడు మీరెలాగ పోతే నాకేం?" అన్నాడు.

ముమ్మూర్తులపుడు "తల్లి కడుపులోని పిల్లవాడా! అల్లరిచేయక వెలు పలకు రావయ్యా!" అని పిలిచారు. అంజనీ గర్భంలోని శిశువంతట అంద రకూ వినపడేలాగా "నేనీ తల్లి పొత్తిళ్ళ యందుండగనే కాపీనం కవచం కుండలాలు యజ్ఞోపవీతాలిస్తేనే నేను బయటికి వస్తా"నని ఖండితంగ చెప్పే శాడు. సృష్టికర్తయైన బ్రహ్మ—పోషణకర్తయైన విష్ణువు—లయకర్త యైన మహేశ్వరులందెవరికీ యావరానీయగల సామర్థ్యం లేక పోయింది.

వారంతా విరాడ్విశ్వకర్మను ప్రార్థించారు. నాగాభరణం ధరించి వారందరకూ గాయత్రీ సమేతంగ దర్శన మిచ్చిన విశ్వకర్మ పరాత్పరుడు తల్లికడుపు లోని పిల్లవాడడిగిన పట్టుగోచి. లోహకవచం రత్నకుండలాలు సువర్ణ యజ్ఞోపలీతాలు ప్రసాదించాడు.

అంజనీదేవి సుఖంగ ప్రసవించింది.

అక్కడున్న దేవమునీంద్రులంతా అంజనీదేవి కుమారున కాంజనేయుడని నామకరణం చేశారు. ఆంజనేయుడంతట విశ్వకర్మ భగవానుని జండామీద నేనుంటానని కృతజ్ఞలు చెప్పుకున్నాడు. అందుకనే విశ్వకర్మ పరాత్పరునకు హనుమద్పతాకధారియనుపేరు వచ్చింది. వాయుదేవుడానందంతో పిచ్చిగంతులు వేశాడు. ప్రాణికోటంతా గాలి పీల్చుకొని బ్రతికిపోయామనుకున్నారు.

అష్టాదశపురాణాలలోని స్కాందపురాణమందున్న నాగరఖాండమంది చెప్పబడిన యీ యితివృత్తమునేతురగా రాజకవి అయ్యంకి బాలసరస్వతి యను కవులాంధ్రీకరించి ధవశేశ్వరపు మార్కండేయ ప్రభువుల వారి కంకిత మిచ్చారు.

# బ్రహ్మదేవుడు నేర్చిన బ్రహ్మవిద్య

అప్పటికింకా సృష్టి ప్రారంభం కాలేదు. పరమేశ్వరుని కుడి భాగం నుండి బ్రహ్మదేవుడు-ఎడమభాగం నుండి విష్ణుదేవుడు-మనసు నుండి రుద్ర దేవుడూ పుట్టారు. పరమ శివుడంతట బ్రహ్మదేవుని చూచి "ఓయీ! క్రిమి కీటక జలచర మృగ జంతు నర దేవ సమూహములతో గూడిన ప్రపంచ మును సృష్టిజేయు పనినీది. సృష్టి క్రమమింక ప్రారంభం చేయ"మన్నాడు. పరమేష్ఠి కపుడు పదవైతే వచ్చింది కాని పనియైతే తెలియలేదు. అజున కంతా అయోమయమై పోయింది. ఎంతసేపు యోచించినా ఆయన కొక దారి డొంకా దొరకలేదు. శంకరుని కంతట నమస్కరించి "దేవా! పరాశక్తి సమేత పరమేశ్వరుండవు. నీవు నియోగించిన సృష్టి విద్య నాకు తెలియుట లేదు. దయవుంచి నాకా పాండిత్యం కలిగే వుపాయం చెప్పు" మని వేడు కున్నాడు.

పార్వతీరమణు డంతట దయామయుడై "వత్సా! చింతపడకుము. భారతదేశమున కైలాస మను పర్వత మున్నది. అది విశాలమైనది. మహా యోగులకు తపో నిలయం. అందైదు ప్రముఖ శిఖరము లున్నవి. అందొక శిఖరమునందు కర్పూర కాంతి గల వాయులింగ మున్నది. అది నాప్రతి రూపము. నీవాలసింపక అచటకు పోయి బిల్వదళముల చేత నా వాయు లింగము నారాధించుచుండుము. నీవంతట సృష్టి విద్యారహస్యము బోధపడ గల" దని వుపాయ మెరింగించాడు.

గౌరీ రమణుండు చెప్పిన ప్రకారం బ్రహ్మదేవుడు దక్షిణకైలాసం వెళ్ళిచూచాడు. ఆయన కక్కడ స్నానం చేయాలన్నా, మంచినీరు త్రాగాలన్నా, శివాభిషేకం చేయలన్నా నీరెక్కడనూ కనపడలేదు. పరిసరాలన్ని తిరిగి చూచిన ప్రయోజనం లేకపోయింది. పరమేశ్వరుని ప్రార్థింపగ శివమాహాత్మ్యకమున వాని చెంత నొక జలాశయం ప్రత్యక్షమయింది. దానిపేరు కైవల్య తీర్థంలో స్నానం చేసిన బ్రహ్మదేవుడు మారేడు దళాలతో శివలింగా న్నలంకరించాడు—కాని స్తోత్రం చేయడం తెలియలేదు.

మహేశ్వరుని ప్రార్థించడానికి నోటివెంట నొక్క మాటయినా పెళ్ళగిల్లిరాక మదన పడుతూన్న చతురాననుని యవస్థ గ్రహించి పరమేశ్వరుడు డదృశ్యముగ నుండియే సమీపమున సరస్వతీ తీర్థమను పేర నింకొక జలాశయాన్ని కూడ రూపొందజేశాడు. ఆ తీర్థమును కన్నుల చూడగనే బ్రహ్మదేవుడు తనకెవరో చెప్పినట్లు చివాలున లేచిపోయి సరస్వతీ తీర్థంలోని నీరు ముమ్మారు మూడు గ్రుక్కలు త్రాగివచ్చి లింగం ముందు కూర్చున్నాడు. బ్రహ్మ నోటివెంట శివస్తోత్ర పదజాలం సముద్ర తరంగాలలాగా ప్రవహించినై. పరమేష్ఠి చేసి న స్తవమున కానందించిన పరమేశ్వరుడు ప్రత్యక్షమై "సురజ్యేష్ఠా! నీకిపుడు సృష్టి చేయగల ప్రతిభ ప్రసాదించాను. ఇకనీవు నీ కార్య రంగమున కుపక్రింపు" మన్నాడు.

కమలాసనుండంతట కరములు ముకుళించి "కైలాస వాసా! కరుణాలయా! నీ యనుగ్రహమున నేనిపుడు సృష్టి చేయగల వాడ నయ్యాను. సృష్టి యంతయు మాయతో కూడి వుంటుంది. మాయామేయ జగతిలో

మానవులు పాపకర్ములు కాగలరు. అట్టివారికి పాపనాశన మార్గములు కూడ మీరే చూపదగిన వారు. నేటినుండి ముందు కాలంబున నెవరైన గాని కర్పూర గంధము గల నీటిచే యీ వాయులింగము నభిషేకించి బిళ్వదళార్చన పూజలు సేయువారికి మోక్షసిద్ధి యగునట్లును—ఈ సరస్వతీ తీర్థమందలి పవిత్రోదకము సేవించిన వారికీ జ్ఞానోదయం బగునట్లును—ఇచటి కైవల్య తీర్థమున స్నాన మాచరించి సరస్వతీ తీర్థమును చూచి నమస్కరించిన వారికి మనో నిశ్చల మేర్పడి వాక్సుద్ధి కలిగి విద్యావికాసము లేర్పడి పండిత సభా గౌరవములు సిద్ధించు నట్లనుగ్రహింపు" మని ప్రార్థింప మహాదేవుండట్లే యగు నని యాశీర్వదించాడు.

అంత నా బ్రహ్మదేవుడు శివలింగ ప్రతిష్ఠ గావించిన యనంతరంబున సకలచరాచరమయి మగునట్టి లీ ప్రపంచమున ఎనిమిది మంది వసువులను, పదకొండు మంది రుద్రులను, పన్నెండు మంది సూర్యులను, దేవదానవ మానవాది గణంబులను, అరువది నాల్గు కళలను, అరువది నాలుగు విద్యలను ఎనుబది నాలుగు లక్షల జీవరాసులు మొదలైన వాని నన్నింటిని సృజించాడు. దేవతలకు దేవుడైన మహాదేవుని మెప్పు పొంద నెదురు చూచాడు.

పరమేశ్వరుడు పార్వతీ సహితంగ సాక్షాత్కరించి "పద్మాసనా! నీ కోరిక ఫలించింది, దేవతలలో నీకగ్ర స్థానం ప్రసాదించుచున్నాను. ప్రపంచము నందు నిన్నందరు వేల్పుపెద్దవని పూజింపగలరు. నీవు నన్ను సేవింప వచ్చినపుడు ప్రతిష్ఠించిన లింగమిక మీదట బ్రహ్మేశ్వర లింగమను పేరున

నీ శ్రీకాళహస్తీశ్వర క్షేత్రమున సుప్రసిద్ధమై పూజింపబడ గలదు. నీ యీ సృష్టి క్రమము బ్రహ్మవిద్య యన ప్రశంస లందుకొననున్నదని వరమిచ్చి యంతర్ధాన మొందాడు.

## కుమారుడు చేసిన కొంటెపని

పార్వతీ పరమేశ్వరుల ముద్దు కుమారులలో కుమారస్వామి యొకడు. ఒకానొక సమయంలో పరమేశ్వరుడు పార్వతీదేవికి ప్రణవోంకారము గురించి సవిస్తరంగ చెప్పాడు. తల్లి ప్రక్కనే కూర్చుండియున్న కుమారస్వామి తన తండ్రి తల్లికి చెప్పినదంతా విని గ్రహించాడు. తరువాత రాక్షస వీరులను చండి మొనగాడయ్యాడు. అంతటితో ఆయనకు గర్వం పెరిగి పోయింది. శంకరుని సమీపించి "నాన్నగారూ! నేను ప్రణవోంకార స్వరూపము నెరింగిన పండితుండేనె గాక దుష్టరాక్షసులను సంహరించిన సంగ్రామ వీరుడిను గూడనయ్యాను. నేనీ మానవులకు దేవతలకు దానవులు మొదలైన వారందరకూ పెద్దగానుండే విద్యాపీఠాధిపత్యం నాకిప్పించండి" అని అడిగాడు.

ఆ మాటలాలకించిన అంబికాపతి కాగ్రహం కలిగింది. ఐనా తమాయించుకుని అబ్బాయీ! నీవు గురుకుల వాసంబున శుశ్రూష చేయకయే నేను మీ యమ్మకు చెప్పిన వేదాంతరహస్య మాలకించి పండితుడ వయ్యావు. పైన గర్వించినావు కూడ. నీవు చేసినది విద్యాపహారణము ఐనప్పటికిని

తండ్రిని కనుక కుమారుడు చేసిన కొంటెపనికి కోపపడక కనికరించు చున్నాను. నిజంగ నీకు విద్యాపీఠాధికారం కావలయు ననుకుంటె నేను చెప్పి నట్లు చేయి.

పూర్వకాలము నందొక శివభక్తుడు దక్షిణ కైలాసంబునకు నైరుతి దిక్కున రెండామడల దూరము నందున్న క్షేత్రమున నన్ను గురించి గోర తపం బొనరించినాడు. నిరంతర మాదగు భక్తి మార్గమున గాక యితర వ్యాసంజంబుల జోలికి పోయిన వాడు కాడు. వేకువ జాముననే లేచి స్నాన సంధ్యాది వైదిక క్రియల నెరవేర్చుకుని భూతముల కాహారము నొసంగిన యనంతరంబున విధివిధానంబుగ తపమాచరించుచుండ సంతోషించిన నేను వానికి సాక్షాత్కరించి "నీకేమి వరము కావలయు" నని యడిగాను.

ప్రాపంచిక భోగములందు విరాగియై జన్మరాహిత్యము నాపేక్షించిన యాతండు భక్తి వినయంబుల నాకాభివందనము లాచరించి "నాగాభరణా! నందివాహనా! నాకు చిరకాలము నుండియు నవాంతర కైలాసమును దర్శింప నభిమతమై యున్నది. నాఈ జీవితకాల మంతయు నవాంతర కైలాసము నందే మీ నామస్మరణతో గడపి మరణాంతరమున శివసాయుజ్యమును చెందు నట్లను గ్రహింపు" మని వరమ్మడిగినందున నేనందుల కామోదించిన వాడనై అచటనే తీర్థమును సృజించి "భక్తాగ్రణీ! నీ నిమిత్తముగ నాచే నిర్మింపబడిన దీనికి వేదతీర్థంబని పేరు పెట్టుచున్నాను. నీవిందు ప్రతిదినము స్నానపానాదులు సేయుచు నన్ను సేవించుచున్న యెడల నీ సంకల్పము ఫలింపగల" దని వరమిచ్చి వచ్చాను.

భక్తిప్రపత్తులు కలిగిన యమ్మునిని నావచనంబులను శిరసా ధరించి శివపంచాక్షరీ మహామంత్రోపాసనచేసి నందున కొలది దినంబులకు వాని కవాంతర కైలాసము కన్పించినది. తానా యవాంతర కైలాస ప్రదేశము నంతయు తిరిగిచూచి. చిరకాలవాంఛ ఫలించుటంజేసి మహామనంబున నింక యితరచింతలులేక వేదతీర్థమునకు సమీపమునందే తపమాచరించిన మహా పుణ్యఫలంబున నవాంతరకైలాసముని యను నామమును ధరించి నాయందు కైంకర్య మొందియున్నాడు.

నీ వచటకుపోయి వేదతీర్థమున శుచివై నన్నారాధించు చుండుము. ఆ సమయంబున ప్రతిదినము నీవు స్నానమాచరించు కొలనునందు ప్రణవము తామరతూటుగ నుదయించి, దానికి మూడుపూవులు పూయుచుండును. నీవా పుష్పములను దెచ్చి శివలింగము నలంకరించుచుంటివేని నేను నీకు దర్శనం బిచ్చి నీవు కోరిన విద్యాపీఠాధికారము నీయగల" నని కర్తవ్యముప దేశించాడు.

## విజ్ఞాన క్షేత్రము - విద్యా పీఠము

తండ్రిగారివలన కర్తవ్యము తెలిసికొనిన కుమారస్వామి తల్లి యను మతినిగూడపొంది, అవాంతర కైలాసానికివచ్చి వేదతీర్థములో స్నానమాడి సంధ్యావందన మాది కృత్యముల నెరవేర్చుకుని సమీపము నందొక లింగ మును ప్రతిష్ఠించి శివధ్యానం చేశాడు. మఱుదినమున గూడ ప్రాతకాలకృ

త్యములను పూర్తిగావించుకొనిన యనంతరమున కుమారస్వామి పార్వతీ పరమేశ్వరులను ధ్యానింపగ ప్రపంచ మందలి పుణ్యతీర్థములలోని జలమంతయు వచ్చి ఒకనదిగా రూపొందింది. శివునానతిని మరువక ప్రతిదినము వేదతీర్థమునందే స్నానమాచరించుచున్న కుమారస్వామి అందుదయించుచున్నా మూడుతామర పుష్పములను తెచ్చి భక్తిప్రపత్తుల లింగమును పూజించుచు కొంతకాలముండగ పరమేశ్వరుడు ప్రమథ గణంబులు పరివారంబులు వెంటనుండ పార్వతీ సమేతంబుగ దర్శనంబిచ్చి ప్రియకుమారుని గాఢాలింగనం చేసుకున్నాడు.

తనచుట్టు మూగియున్న వారందరను ఒక్కసారిగ చూచిన కుమారస్వామికి కైలాసమే కదిలి వచ్చిందన్నట్టు లనిపించింది. తల్లిదండ్రులకు పాదాభివందనం చేసి నిలుచున్నాడు.

పరమ శివుడంతట "ప్రియకుమారా! కుమారా! నీవు భక్తి గలవాడవై నేను చెప్పిన చందంబున జపతప నియమంబుల బాయక ప్రవర్తించి నందున నేనెంతయు సంతసించితిని. నీవభిలషించిన విద్యాపీఠాధిపత్యము నీకిచ్చుచున్నాను. ఇదుగో. ఈ దక్షిణ కైలాసము నందె వాయులింగమున్న భాగమున కీశాన్యముగ నొక పర్వత శిఖరమును సమస్త వేద శాస్త్ర పురాణేతిహాసములకు నియమంబగునట్లుగ మంత్ర యంత్ర తంత్ర బలంబులతో నిర్మించాను. అందు విద్యాపీఠమున్నది. నీవు దాని నధిరోహింపుము. నిన్ను ప్రార్థించిన వారికి నీవు విద్యావివేకంబుల ప్రసాదింపుము. ఇక ముందీ పర్వతభాగము విజ్ఞాన క్షేత్రమను పేరున ప్రఖ్యాతి నొందగలదు.

వేదతీర్థమున నీవు ప్రతిష్ఠ చేసిన లింగమునకు స్కంధ లింగమని నామకరణం బొనరించాను. స్కంధ లింగము వలన నిచటి తీర్థమునకు స్కంధ తీర్థమని నామాంతర ముదయింప నున్నది. అందు స్నాతులై స్కంధలింగము నారాధించిన వారికి బ్రహ్మజ్ఞానమును, శివసాయుజ్యమును సిద్ధించునట్లు నేననుగ్రహించు చున్నాను. అటులనే నీపవిత్రాశయమున ప్రపంచమండలి పుణ్యతీర్థము లన్నింటిలోని జలము వచ్చి యీ క్షేత్రమున ప్రవహించుచున్న యేరునకు "ధర్మమల్య"మను నామకరణ మొనరించు చుంటి ననియువివరించి షణ్ముకు నాశీర్వదించాడు—సాంబశివుడు.

## వినాయకుని ఆశీర్వదించిన విజయగౌరి

ఒకనాడు సభదీరి యున్న పరమేశ్వరుడు ప్రమథగణము మొదలైన వారికి శివపంచాక్షరీ ప్రభావమును గురించి చెప్పాడు. అది విని పార్వతియు వ్యామోహితురాలై "స్వామీ! అంత మహిమంబు గల శివపంచాక్షరిని నాకు మంత్రోపదేశం చేయరా!" అని యడిగింది. పరమ శివుడనుగ్రహించి "కాంతా! దీని కింతగ నీవు నన్ను ప్రార్థింప వలయునా? రేపు లింగోద్భవ కాలమున నీకా పంచాక్షరీ మంత్రము నుపదేశ మీయగలను. నీవు వేకువనే మేల్కొంచి తలంటు స్నానము చేసి రాత్రిలింగోద్భవకాలము వరకు నెవరి

తోడను మాటలాడక సాంకేతిక సమాధానములతో మౌనవ్రతమును పాటింప వలయును. పొరపాటుగ నేనియు మాటలాడరా” దనియు చెప్పాడు.

పార్వతి పరమానందం చెంది మరు దినమునందు మౌనవ్రతము పూనిన దయ్యుఁను పొరపాటున తన స్నేహితురాలైన మాలినితో “ఆది శంక రులవారు నాకీ దినమున శివపంచాక్షరీ మహామంత్రోపదేశ మొనరించెద మని చెప్పియున్నారు. నేను మౌనవ్రతం పాటించుచున్నాను. నీవు నన్నీ రోజున మాత్రము పలుకరించి మాటాడకు” మని చెప్పింది.

రాత్రి లింగోద్భవకాల మయింది. పార్వతి పరమేశరుని సమీపించి పాద నమస్కారం చేసి మంత్రోపదేశ మొంద నాయత్త మయింది. చంద్ర శేఖరుం డంతట చిరునవ్వు నవ్వి “అమాయకురాలా! నీవీ నాటి యుదయం బున మాలినితో “నేను మౌనవ్రతం పాటించుచున్నా” నంటివి. అది మాటా డుట కాదా! నీవా విషయంబును సాంకేతముగ చెప్పవలయును. లేదా. లోగడ దినమే చెప్పియుండవలయును. అట్లుగాక నీ మౌనవ్రతమును భంగ మొనరించుకుంటివి. నీవు నాకెంత ప్రియురాలవైనను మంత్రోపదేశము పొందుట కర్హురాలవు కాకపోవుటయె గాక, పతియాజ్ఞ తప్పిన కారణంబున దైవత్వమును కోల్పోయితి” వనియు వివరించి చెప్పాడు.

అంతనా గౌరి జరిగిన పొరపాటు తెలిసికొని తన దురదృష్టమును నిందించుకుని శివుని పాదములంటి “స్వామీ! నా యపచారమును మన్నిం పుము. ఇది కేవలము ప్రమాదమె కాని బుద్ధిపూర్వకమెంత మాత్రమును కాదు. దైవత్వము నశించినపుడు మానవాంగనై మీసాన్నిధ్యమున లేక

భూలోకము నందెంతకాలము సంచరింప గలను? నాయందు దయయుంచి నేను తిరిగి మీ యర్ధాంగి స్థానమునందుండుటకును. మీవలన శివపంచాక్షరిని పొందుటకు నేచేయదగిన కర్తవ్య మేదియో సెలవీయుం"డని వేడుకున్నది.

మహేశ్వరి మాటలకు మనసు ద్రవించిన మహాదేవుడు ప్రశాంతముగ "దాక్షాయణీ! నేను మాత్రము నిన్ను విడనాడి యుండగలనా! అటులని నేను చేయగలదియు లేదుకద! మన దేవత్వమునకు కొన్ని యర్హతలున్నవని నీకును తెలియును. మనము వాని నతిక్ర మించినపుడు వాని ఫలితంబుల ననుభవింపక తప్పదు. తిరిగి శీఘ్రకాలమున మనము కలిసికొనుట కుపాయము నెరింగించెద నాలకింపుము.

భూలోక మందలి భారతదేశము పరమేశ్వర లీలలకు నిలయము. దక్షిణ సముద్రమునకు పైభాగమున హిమాలయమునకు దిగువగ గంగానదీ తీరమునకు నూట తొంబదైదు యోజనముల దూరములో శివానందైక్య నిలయం బన నొప్పు దక్షిణ కైలాస పర్వత మున్నది. దాని నంటుకొని మహా పవిత్రమయిన సువర్ణముఖీ నది ప్రవహించుచున్నది. నీవచటి కేగ ప్రతి దినము నదీజలంబులందు స్నానమాడి మారేడు దళములతో వాయులింగము నలంకరించుచు నన్ను స్మరించు చుంటివేని నే నచిరకాలంబుననే నీయొద్దకు వచ్చి నీయభీష్టము నెరవేర్చెద" నని సమాధానపరచాడు.

# వినాయకుని ఆశీర్వదించిన విజయగౌరి

మానవకాంతగ మారిపోయిన మంగగౌరి భూలోకం లోనికి వచ్చి దక్షిణకైలాస మెచటనో తెలియక కేదారక్షేత్రం చేరుకుని అందున్న తీర్థమున శుచియై, అచటి లింగాన్నారాధించు చున్న సమయము నందొకనాడు నారదమునీంద్రు డామెను సమీపించి పలుకరించాడు. పార్వతి తన పరిస్థితి నంతయు చెప్పుకుని వాపోయింది.

బ్రహ్మమానస పుత్రుడు పరమ భాగవతోత్తముడు నైన నారదున కామె యెడల జాలికలిగింది. "అమ్మా! ఇది నీవనుకొనిన దక్షిణకైలాసాచలం కాదు. శంకరభగవానుల వారు సీకెరింగించిన గుర్తులను మరచిపోయి కేదారక్షేత్రమునకు వచ్చావు. ఇదియు పుణ్యక్షేత్రమైనందున దోసము కాక పోయినను పరమేశ్వరుం డాజ్ఞాపించిన దిచ్చటకు కాదుగద! జరిగిన దేదో జరిగి పోయింది. దానికై విచారపడ దగినంత పనియులేదు. నీ సంకల్పము నెరవేర వలయు ననిన శివాజ్ఞానుసారముగ నీవు వాయులింగము నారాధించు టవసర మన్నాడు.

దారితప్పి తావరం మారిన గౌరమ్మ కాస్త తెమలించుకుని "నారదా! ఇంత భక్తి శ్రద్ధలతో వచ్చిన నాకీ యంతరాయ మెందుకు వచ్చిందంటావు?" అని అడిగింది. మహామునికి మళ్ళీ పనిపడింది. "అమ్మా! భగవతీ! నీవు ముందుగ గణపతి పూజ చేయకయే యీశ్వరోపాసన కుపక్రమించావు. సిజా

నికా వినాయకుడు నీకొడుకు కాడని నేననుట లేదు. ఐనా విఘ్నాధిపతి గద! ఎంతటి వారైనా సరే ఎవరి బాధ్యతలు వారు నెరవేర్చకపోతే ఏపనీ సాను కూల పడదని నీకు చెప్పగలవాడను కాను. కాబట్టి నీవు ముందుగ వినాయ కుని పూజించితే తలచిన పని తప్పక నెరవేరు తుం" దంటూ తాంబుర మీటుకుంటూ తనదారిని తాను పోయాడు.

నారదముని మాటలమీద నమ్మకము కుదిరిన నగరాజకుమారి స్కాంద కల్పము ననుసరించి వినాయకు నారాధించింది. వినాయకు డంతట పార్వతిని సమీపించి "నీకిపుడేమి కావలయునమ్మా" అని అడిగాడు. పార్వతి "నాయనా! నేనిపుడు మీనాన్నగారి యనుమతి ప్రకారముగ దక్షిణ కైలాసం వెళ్ళి వాయులింగము నభిషేకింప వలసి యున్నది. నాకార్యమునకు పుష్టి నిమ్మ" న్నది. గణపతి యంతట కాత్యాయని నాకేదారము నందలి పవిత్ర జలాశయములలో స్నానములు చేయించి తానొక బాలబ్రహ్మచారి రూపం ధరించి శివరాణిని దక్షిణ కైలాసమునకు తీసుకుని పోయి సువర్ణముఖీ నదిని వాయులింగములను చూపి ఆమెనివాసమున కవసరములైన వసతుల నన్నిం టిని కలిగించాడు.

పార్వతియు తనకంత మహోపకారం చేసిన వినాయకుని తల్లిగా వర మియ్యా లనుకుంది. "నాయనా! నీవు నాకు కుమారుడ వైనను గణాధిపతివిగ నిన్ను గౌరవించడం నాధర్మ" మంటూ వినాయకుని వాయులింగమున కిం చుక దూరంతో దక్షిణభాగంబున గూర్చుండ నియమించి శోడశోపచారాలతో పూజించిన తరువాత "నీకు ప్రజలచేత, దేవతలచేత, దానవులచేత, మునుల

చేత, సమస్తలోకములలోని వారిచేతను ప్రథమ పూజ లభించుగాక" యని దీవించింది.

గణపతి యంతట జగన్మాతయైన మహేశ్వరిని కేదార క్షేత్రమందలి తీర్థములలో స్నానము సేయించి పాపపరిహారము గావించినందున కృతయుగంలో "పాపహారివినాయకు"డనియు, హైమవతి తపమున కంతరాయము తొలగించినందున త్రేతాయుగంలో "విఘ్నశాంతి వినాయకు"డనియు పార్వతిచే పూజింపబడి నందున ద్వాపరయుగంలో "పార్వతీపూజిత" వినాయకు డనియు, తల్లికి పుష్టి నిచ్చి నందున కలియుగంలో "పుష్టి వినాయకు"డనియు ప్రసిద్ధినామములను ధరించి యున్నాడు.

## మహేశ్వరికి దుర్గ చేసిన మహోపకారము

తల్లిదీవెనలు పొందిన చల్లని వినాయకస్వామి యంతట వాయులింగమునకు వాయువ్యము నందున్న యొకప్రదేశమును చూపి "అమ్మా ఈ స్థలము మహామహిమంబు కలది. ఇచటి స్థల విశేషంబున సంకల్పము లతి శీఘ్రంబుగ నెరవేరకలవు కావున నీవిందే తపమాచరింపు"మని చెప్పాడు.

పార్వతి వాయులింగానికి పడమరగ నొక కొలనేర్పరచింది. తరువాత నా కొలాశయం గౌరీతీర్థమను పేరున గణన కెక్కింది. నార చీరెలుధరించి,

రుద్రాక్షమాల దాల్చి, విభూతి నలంకరించి శివదీక్షబూనిన దాక్షాయణి మనంబున సంకల్పించి నంతనే కైలాసము నుండి మాలిని దుర్గాదేవి మొదలైన ప్రమథగణస్త్రీలు కాళహస్తి క్షేత్రము నందున్న పార్వతి చెంతకువచ్చి భక్తి వినయంబుల వందనములుచేసి "భవానీ! మమ్మిచ్చటి కేలరావించితివమ్మా!" అన్నారు.

పరమేశ్వరియు వారితో నేనిచట నాస్వామి యాజ్ఞానుసారముగ తపోదీక్ష వహింపబోవుచున్నాను. దుండగుల వలన దాని కంతరాయములు సంభవించెడి సూచనలు కన్పట్టుచున్నవి. "దుర్గా! నీవు మున్నొకానొక సమయంబున నాయంశ యందావిర్భవించిన దానవు. ఆశ్రితులకు నీవెంత ప్రశాంత స్వరూపంబున దర్శన మిచ్చినను, దుష్టులైన వారికిమాత్రము నల్లని మేనితో భయంకరములైన దంతములతో, నిప్పు కణికల వంటి కన్నులతో, తల పుర్రెల కంఠహారంతో గదా ఖడ్గ శూలాది భయంకర మారణా యుధాలతో కన్పింపగల కాళరాత్రివి కావున, నీ పరివారమును వెంట నుంచుకొని నా తపశ్చర్య కెటువంటి భంగము రానీయక కనిపెట్టి యుండుము. మనమాలిని మొదలైనవారు నాకు వలయు గంధ పుష్పాక్షతల సమకూర్చుచుండ"వలయు ననగ వారందరు దేవీయానతి తల ధరించారు.

అలాగ నూరేండ్లు గడచి పోయినై.

అచలకుమారి అఖండ తపోదీక్ష చూచిన శంకరుడు లోలోన నవ్వుకున్నాడు. తనదేవేరి చూపుచున్న దక్షత కానందించాడు. ఐనా ఒక్కసారి పరీక్షించి చూడాలని పించిం దాయనకు. మహాదేవుండంతట తనమాయా ప్రభా

వంచేత మాయా సముద్రాన్ని కల్పించి కాళహస్తి క్షేత్రము నంతటా అల్ల కల్లోలం చేయ నియమించాడు. మాయా సముద్రమంతట గగనతలాన్నంటుతున్న తరంగాలతో దిశలందు మరుమ్రోగు గొప్ప ధ్వనితో ధణధణ మనుచు పరుగులెత్తి వచ్చుచున్న ప్రవాహమును చూచినదే తడవుగ దుర్గా దేవి భయం కరాకారం దాల్చి సమీపించిన సముద్రజలము నంతయు నొక చేతబట్టి గటగట తాగ్రివేసింది.

తపస్సమాధి యందున్న పార్వతి కది తెలియనే తెలియదు. దుర్గ చేసిన సాహసము కనులార గాంచిన దేవమునీంద్రాదులు మహాశ్చర్య చకితులయ్యారు. అప్రయత్నంబుగ వచ్చి పడబోయిన మహాజల ప్రళయంబు నుండి ప్రపంచమును సంరక్షించిన దుర్గ నందరూ కొనియాడారు. భయంకర సముద్రము నంతయు హస్తగతము చేసికొని నందున నామెకు "హస్తాత్త సాగర" అని కీర్తించారు కూడ. లోకమాత తపోదీక్షకేలోపం లేకుండ నెరవేరింది.

మరికొన్ని దినంబులు గడచిన తరువాత వారిచెంతకొక బ్రాహ్మణుడు వచ్చారు. ఆయన సాక్షాత్పరమేశ్వరునివలె నున్నాడు. ఎవరైన గానిలెమ్మని యింటికి వచ్చిన బాటసారికి పార్వతి సకలోపచారాలతో అతిథి మర్యాదలు చేసింది. ఆమే యుపచర్యల కానందించిన బ్రాహ్మణుండు "సౌభాగ్యవతీ! రానున్న పుష్య శుక్ల పౌర్ణమీ నక్షత్ర పుణ్యకాలంబున నీకు పరమేశ్వరుండు ప్రసన్నుండు కాగలం"డని యాశీర్వదించి యంతర్ధానమొందాడు.

# పార్వతి పొందిన పరమేశ్వరానుగ్రహము

అవాంతరాలు గడచిపోయినై. పార్వతీదేవి తపసు ఫలించింది. పరమ శివుడు వాయులింగమందె ప్రత్యక్ష మయ్యాడు. ప్రాణేశ్వరుని రాకచూచి పరమానంద మొందిన మృడాని స్వామి పాదాల మీద వ్రాలింది ప్రియమార రెండు చేతులతో పట్టి లెమ్మనిన శంకరుడు "హైమవతీ! కైలాసమున నున్న గంగను నేను నీ నిమిత్తముగా నిక్కడకు రావించి, నీవు నిర్మించిన గౌరీతీర్థ మునకు సమీపము నందుండ నియమించాను. నీవందు స్నాన మొనరింపుము. ప్రస్తుతమైన నీ యీ మానవదేహము మహిమాన్వితమైన దైవత్వమును పొందగల" దని చెప్పినంత పార్వతి గంగాతీర్థమున మునిగి నిజదేహం పొంది ప్రకాశించింది.

పరమేశ్వరుం డంతట పార్వతికి గురుశిష్య ధర్మముల నెరింగించిన తరువాత శివపంచాక్షరీ మంత్రోపదేశం చేశాడు. అంతే కాకుండ "పార్వతీ! ఈ శుభసమయంలో నీకోరికేమిటో చెప్పు తీరుస్తా" నన్నాడు. మహేశ్వ రియు ముదమొంది "స్వామీ! కేదారము నుండి నన్నిచ్చటకు గొనివచ్చిన మన కుమారుడు వినాయకుని నేనుపుష్టివినాయకునిగా పూజించిన చోటు నందా తడు శాశ్వతంగ నిలిచియుండి తన్నారాధించిన వారి కార్యముల సాఫల్య మొనరించులాగునను. మాయా సముద్రమును హరించి నాతపసుల కంత

రాయము తొలగించిన మనదుర్గ యీప్రాంతమున నిలిచియుండి ప్రజలచే పూజ లందుకొను లాగునను—ఈ సువర్ణముఖీ తీరమున నాపేరున ప్రకాశం బైన గౌరీతీర్థము మహామహిమంబు కలదై అందు మీరు నాకు ప్రసన్నులైన ఈ పుష్య శుద్ధ పౌర్ణమీ పుణ్యదినమున స్నాతులై కాళహస్తీశ్వరులైన మిమ్ము సేవించిన వారి సమస్త పాపములు నిశ్శేషముగ హరించి వారికి మోక్షము సిద్ధించులాగునను—నేనికముందే పొరపాటులు సేయక జ్ఞాన ప్రసూనమట్లు వికాస మొందులాగునను—మీచే యుపదేశమైన ఈప్రణవ పంచాక్షరిని సర్వవేళల సర్వావస్థలందు జపించి నేను సంపూర్ణ ఈశ్వరాను గ్రహము పొందులాగును నైదు వరము లిం"డని కోరింది.

శివుడనుగ్రహించి "తథాస్తు—నీవనినట్లే యగుగాక" అన్నాడు.

పార్వతీ పరమేశ్వరానుగ్రహమున వినాయకుడు పుష్టివినాయక నామంబున సర్వజగంబులచేత పూజితు డయ్యాడు. దుర్గ సముద్ర జలము లంతయు నరచేత బట్టిన కారణంబున "హస్తాత్త సాగర" మనుపేరు దాల్చి కాళహస్తి గ్రామవాస్తవ్యులకు దేవతయై సేవింపబడుచున్నది. సువర్ణముఖీ నదీతీరమందలి గౌరీతీర్థము మహామహిమంబు గలదై సమస్త దేవ దానవ యక్ష కిన్నెర కింపురుష సిద్ధ సాధ్య మునిజనంబుల బునీతులను చేయు చున్నది. శంకరుండంతట పార్వతితో "అంబికా! పుష్యశుద్ధ పూర్ణిమ యందుగాని, మాఘబహుళ చతుర్థశి మహాశివరాత్రులందుగాని, మకర కర్కా టక సంక్రమణములందుగాని, సూర్యగ్రహణ చంద్రగ్రహణములు మొద లైన పర్వదినము లందైనను గౌరీతీర్థమున స్నానమొనరించి మన మర్చ్వను

స్మరించిన వారికి బ్రహ్మాదుల కందని మోక్ష సామ్రాజ్యము లభింపగలదు. నీవు జగజగంబుల తాపర్యమాతవై జ్ఞానప్రసూనాంబవై నాకర్ధాంగివిగా నారాధనల నందుకొన గలవు. శివపంచాక్షరిని జపించిన వారికి శివసాయుజ్యము ప్రాప్తింపగల" దన్నాడు.

నటరాజు నోటినుండి యామాటలు వెలువడు చుండగనే దేవ దుందుభులు మ్రోగినై. గగనం నుండి పూలవానలు కురిసినై.

# కనకదుర్గ కల్పించిన మౌసల తీర్థము

పార్వతికి వరము విచ్చిన పరమేశ్వరుడు దుర్గతో "నాప్రియురాలికింత మహూపకారం చేసిన నీవు నాకత్మీయురాలవు. ఈసమయంలో నేను నీకేదైన నొకమేలు చేయదగిన వాడను. నీకు దైవత్వమును అనుగ్రహాను గ్రహశక్తిని ప్రసాదించుచున్నాను. ఇక మీదట నీవీ కాళహస్తీ యందు గ్రామదేవతవై యుండుము. ప్రజలు నిన్ను పూజించెదరు. నీకండదండలుగ మేము కనిపెట్టియుం"దుమని చెప్పాడు.

ఆమాటలాలకించిన దుర్గయు వినయాంజలి చేసి "మహానుభావా! మీ యనుగ్రహమునకు పాత్రురాలనైన నేనదృష్టవంత రాలను. ఒక విషయము నారూపమతి భయంకరమైనది. కరిమేఘము వంటి నల్లని శరీరము. దయ్యపు జుట్టువలె విరియబోసికొన బడిన తల వెంట్రుకలు. చింతనిప్పులట్లు మండు

చున్న నేత్రములు, పులికోరలట్లు భయంబు కలిగించు దంతములు, మెడలో యెముకలదండ, చేతిలో మారణాయుధంబులును గల నన్ను చూచి జనమిప్ప టికే కంపమెత్తి పోవుచున్నారు. సహజముగ పిరికివారైన యెడల నన్ను చూచుచునే ప్రాణాలొదులు చున్నారు. నన్ను చూడకపోయినా రూపం వింటె పసిపిల్లలు ప్రాలు ద్రావడం లేదు. ఈస్థితిలో నిన్ను సమీపించి సేవించే దెవరు?—నే నభిమానించి పాలించేదెవరిని?" అని అడిగింది.

అందులకా పరమేశ్వరుడు తలాడించి "ఔను. నీవన్నది కూడ నిజమే. ముందుగ నీవీ భయంకరా కారమును సుందరముగ మార్చుకొనుట వసరం. అందులకు గాను నీవు నేను చెప్పినట్లు చేయుము. ఈ వాయులింగ మున్న ప్రదేశానికి వాయురథముగ సమీపము నందొక కొండయున్నది. నీవచ్చటకు పోయి శివలింగమును ప్రతిష్టించి పూజింపుము. కొలది దినము లలో నీయీ వికృతాకార మంతయు సుందర రూపముగ మారగలదు. అప్పుడు నిన్నందరు సమీపించి సేవింపగల"రని చెప్పాడు.

శివునానతి శిరమున ధరించిన దుర్గ పార్వతీదేవి మున్నగు వారిచెంత ననుమతినిపొంది శంభు డెరింగించిన ప్రదేశమునకు పోయి తన చేతనున్న ముసలాయుధంతో నొక కొలనుద్రవ్వింది. దానిప్రక్క శివలింగమును ప్రతి ష్ఠించింది. ప్రతిష్ఠించిన శివలింగమును మారేడు దళములతో నలంకరించి భక్తి వినయంబుల ప్రార్థించుచున్న కొన్ని దినంబులకు నాగాభరణు డందె సాక్షాత్కరించి "భక్తురాలా! నీ కభీష్టమైన వరం నీవు కోరుకొ"మ్మన్నాడు.

తన సంకల్పంఫలించి దైవమనుగ్రహించి నందున పరమానంద భరి తురాలైన దుర్గ సాష్టాంగ ప్రణామంబు లాచరించిన పిదప నాథర్గు ననేక

విధంబునల గొనియాడి "నందివాహనా! నాకు కావలసిన దేదియొ మీకు తెలియనిది కాదు. ఐనను దైవముగ మీరు చెప్పినపుడు భక్తురాలనుగ నేనుకోరుకొనుటయు సమంజసమైనదే. ప్రస్తుతము నాయందున్న యీ భయంకర రూపమంతయు మారి సర్వజనాకర్షణీయమైన సుందరాకృతిని నాకు ప్రసాదింపు" మనికోరింది.

దయాంతరంగు డైన సాంబశివు డట్లైనని "దుర్గా! నీ యభిలాష నెరవెర నున్నది. నీకు ప్రసన్న ప్రశాంత సుందరరూపము నిచ్చితిని. నీనల్లని శరీరచాయ పసుపుపచ్చని కాంతితో ప్రకాశింప గలదు. పసిడిఛాయ గల నీవు కనకదుర్గవై యికమీదట నెల్లరకు దర్శన మీయగలవు. నీవు నివసించుటం చేసి ఈపర్వతము కనకాలచల మనుపేరున పిలువంబడ నున్నది. దీనికి పడమర భాగంబున నీవు రోకలిచే గొట్టి రూపొందించిన జలాశయమునకు "మూసల తీర్థ" మని పేరుపెట్టు చున్నాను. నీచే ప్రతిష్ఠ చేయబడిన లింగమునకును పూజానమస్కారములు సిద్ధింప నున్నవి. నేను నీకు సాక్షాత్కరించిన యీ శ్రావణకృష్ణాష్టమీ రోహిణీ నక్షత్ర పుణ్యకాలంబున యీమూలస తీర్థమందు గ్రుంకులిడి నీపేరనొప్పు నీదుర్గేశ్వర లింగము నభిషేకించి దుర్గాచల మనంబడు నీక్షేత్రమాహాత్మ్యమును విన్నవారికీ చదివినవారికి నేనష్టసంపదల నిచ్చి, చివరకు నాయందైక్యము చేసికొనుట యందేట్టి సందేహముండ"దని చెప్పి యదృశ్యమయ్యాడు.

నేడా పర్వతము కనకాచలము, లేక దుర్గాచల మనియు, అచటితీర్థము మౌలస తీర్థమనియు, అందున్న లింగము దుర్గేశ్వర స్వామి యనియు

ప్రసిద్ధినొందినవి. దుర్గ ప్రసన్న రూపమున కాళహస్తి ప్రజలకు గ్రామదేవతయై పూజింపబడుచున్నది.

# సనత్కుమార శుకయోగీంద్రుల సంవాదము

పరాశరమునీంద్రుల వారొక సమయమున శుకయోగిని సనత్కుమారుని వెంటబెట్టుకుని గంగానదీ స్నానం చేసి కాశీ అన్నపూర్ణ సమేత విశ్వనాథ స్వామి నారాధించి రావలయునను తలంపున యాత్రకు బయలుదేరాడు. మునులు ప్రక్కవారితో పరిమితముగనే మాటలాడు తుంటారు. సాటి మునులు కలిసినపుడేదో యొక వేదాంత చర్చలు చేస్తుంటారు సనత్కుమార శుకయోగీంద్రుల సాధారణ సంభాషణ క్రమక్రమంగా వాదోపవాదాల స్థాయి నందుకుంది. ఇంకనూ తర్కనీయాంశ మేమిటంటే—శుకయోగి జీవాత్మ వేరు పరమాత్మ వేరని యుపన్యసిస్తున్నాడు. సనత్కుమారుడు జీవాత్మ పరమాత్మలు రెండు నొక్కటేనని వాదిస్తున్నాడు. ఇక మూడవ వారైన పరాశరముని "మనమీ విషయాన్ని గురించి యింకొకసారి మాటాడుకుందాం" అని వాయిదా వేశాడు.

వారు ముగ్గురూ కాశీనగరంలో గంగా స్నానాలు చేసి విశ్వేశ్వర స్వామి సందర్శనం గావించు కున్న తర్వాత అందొకచోట గుమిగూడి యున్న యోగిపుంగవుల చెంతకు బోయి "జీవాత్మ పరమాత్మ అనునవి

రెండురెండా! ఒకటా!" అని అడిగారు. శివపరయోగులైన వారు వీరి వాలకం గమనించినందున యెవరికి వారే యీగొడవ మనకెందుల కనుకొనినట్లుగ మాటాడలేదు. సనత్కుమార శుకయోగీంద్రులది యదనుగా భావించి వారి మధ్య చోటు చేసుకుని కూర్చుండి మాకన్న పండితులే లేరన్నట్లుగా తిరిగి వాదానికి తలపడ్డారు. ఎవరూ తగ్గడం లేదు. ఒకరిదారి కింకొకరు రావడమునూ లేదు. ఒకరి కంటె యింకొకరు రెచ్చి పోతున్నారు. అక్కడున్న వారిలో కొందరు వీరివంక వింతగ చూస్తున్నారు.

ఇంతలో గంగాస్నానార్థం కాశికి వచ్చిన బ్రహ్మదేవు డనుకొనకుండ వారి చెంతకు రావడం సమకూడింది. అక్కడున్న వారంతా లేచి నమస్కరించి బ్రహ్మదేవునకు స్వాగతం చెప్పారు. కమలాసనుండు సుచితాసనమున కూర్చుండిన తరువాత "పితామహా!" ఇప్పుడిచట "జీవాత్మ పరమాత్మల కభేదమా! భేదమా" అను చర్చ జరుగుచున్నది. అందు మాకే నిర్ణయమును తేలకున్నది కావున తమరిచ్చిన తీర్మానము నంగీకరింప దలంచినాము. దయయుంచి మాకీ ధర్మ సందేహమును తీర్చవలయు" నని అందున్న వారడిగారు.

బ్రహ్మదేవు డంతట "నాయనలారా! జ్ఞానులైనవారు జీవాత్మ పరమాత్మలను వేరుగ భావింపరు. జ్ఞానము లోపించిన వారు మాత్రము వేరుగనే భావించుచుందురు. ఇది సత్యము. ఇందులకు తార్కాణమున సాండిల్యుని కథ యొకటి చెప్పెద నాలకింపుడు."

# దక్షిణ కైలాస మేతించిన ముగ్గురు మునులు

కొన్ని దినముల క్రితముగ జరిగిన సంఘటన యిది. సూర్యగ్రహణ కాలంబున వ్యాసముని శక్తిముని పరాశరమునులు ముగ్గురు మరికొందరు మునులు నొకనాడు ఉదయకాల సంధ్యా సంకల్పంబుల ముగించు కొనిన తరువాత సుఖాసీనులై యుండగ సాండిల్యముని వారిచెంతకు వచ్చి కూర్చుండి తాను ద్వైతమత స్థాపనాచార్యుండనని చెప్పుచు, అద్వైతమును గురించి తన కంతయు తెలియు నన్నట్లుగ వితండ వాదము సేయ బూనాడు. అపుడం దున్న వారిలో సత్య యజ్ఞుండను వృద్ధముని లేచి వాని ముందునకు వచ్చి “ఓయీ! సహేతుక సారాంశము లేని నీ సంభాషణము వినరా” దనుచు చెవులు రెండింటిని చేతులతో నదిమి పెట్టుకుని యచ్చోటును వీడి పోయె నని చెప్పుచుండగనే యిచట నున్న శుకయోగ సనత్కుమారు లిరువురును పకపక నవ్వి “సత్యయజ్ఞుం డంత సమర్థుడైన యెడల సభవీడి పోవు టెందుల” కని పరిహాస మాడారు.

అంతట పరమేష్ఠి వారల వంక చురచుర జూచి “మూర్ఖులారా! దురహంకారమున కన్నులు గానక నోటికి వచ్చినటు లెల్లయు వాగుచుండెడి దంభప్రలాపులతో మహనీయులు మాటాడరు సరికద, వారి మొగమైనను చూడరు. అప్పుడా మునుల మాట నటుంచుడు. సత్యయజ్ఞు నింత చుల్కనగ

పరిహాసించిన మీలో నెవరైన నాతని నెట్లు కాదన గలరో నాముందు విష రింప గలరా!" యని నంత వారింక నోరు మెదపలేక పోయారు. చతురాన నుండంతట "మీరు నిత్యవేద పారాయణుడు. మహాపండితుడు. వయోవృద్ధుడు. సార్థక నామధేయుడైన సత్యయజ్ఞ మహా తపస్వి నాక్షేపించిరి. కావున ముని నిందా పాపకర్ములయ్యారు. పుణ్యమునకై వచ్చిన మీరు పాపమును గట్టు కొంటిరి. మీకు నామాటలమీద నమ్మకము కలదేని నేను చెప్పినట్లు చేసి పవి త్రులు కండు.

అన్నపూర్ణా సమేత విశ్వనాధుని క్షేత్రమైన యీ వారణాశి నగరానికి దక్షిణముగ నూట తొంబదైదు యొజనముల దూరమున దక్షిణకైలాసం బనంబడు మహాప్రభావంబు గలిగిన కాళహస్తీశ్వర క్షేత్రమున్నది. దానికే శివానందైక్య నిలయమనియు మఱియొక పేరు కలదు. అందు పంచముఖ రుద్రాక్షవలె నైదు ముఖంబులు కలిగి, కర్పూరపు కాంతి యట్లు తెల్లని చాయ తోడ వెలయు వాయులింగ మున్నది. దానికి పశ్చిమంబుగ మహా పవిత్రమైన సువర్ణముఖీ నదియు ప్రవహించు చున్నది. మీరు వెనుక ముందు లాలోచింపక శీఘ్రముగ నచ్చోటునకు బోయి నదీ జలంబుల స్నానముచేసి రుద్ర నమచమకములతో జ్ఞాన ప్రసూనాంబా కాళహస్తీశ్వరు నారాధించితి రేని శివ దేవానుగ్రహమున మీ పాపము లన్నియు సంపూర్ణముగ హరించి ద్వైతాద్వైతతత్త్వ రహస్యము బోధపడుట కెట్టి సందేహమును లే"దన్నారు.

బ్రహ్మదేవుని మాట తిరుగు లేనిది కనుక పరాశర సనత్కుమార శుకయాగుల మహర్షులు శివలాసనని చెంత సనుజ్ఞ పొంది కాశీవిశ్వేశ్వర

మూర్తిని పూజించుకొని. అచటి నుండియే దక్షిణకైలాసంబున కరుదెంచి స్నాతలై కైలాసాచలంబునకు ప్రదక్షిణ చేసి శివానందైక క్షేత్రమునందా దినము క్షేత్రోపవాసం చేశారు. మరు దినమున సూర్యోదయమునకు పూర్వమే మేల్కొంచి కాలకృత్యంబుల దీర్చుకుని స్నానసంధ్యాది క్రియల నెరవేర్చుకుని మునుముందుగ వారొకించుక తడ వందు ప్రకాశంబైన మఱ్ఱి చెట్టు క్రమాను యొద్ద గూర్చుండి యీశ్వరారాధనలు సేయుచు కొంతకాలం గడిపారని చెప్పి బ్రహ్మ యింకా యిలాగా అన్నాడు.

## దక్షిణామూర్తి సందర్శనము

మునులారా! ఆరోజు చైత్రశుద్దదశమీ ఆదివారం ఆశ్లేషానక్షత్రమైన పుణ్యకాలంబున పరమేశ్వరుండు తలమీద బాలచంద్రుడు, జటాజూటమున గంగ, మెడలో నాగాభరణము, కటితలంబున కరిచర్మము, చేత త్రిశూలములు ప్రకాశించుచుండ ముక్కన్నుల దైవమై దక్షిణామూర్తి నామంబున నామునిత్రయము ముందు ప్రమథగణంబుల తోగూడ సాక్షాత్కరించాడు. ప్రసన్నుడైన పరమేశ్వరునకా సంయమిచంద్రులు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, మహాదేవునకనేక విధంబులుగస్తోత్రములు చేసినంత నమ్మహనీయుండు సంతసించి వారలను "నావలన మీకేమి కావలయు" నని యడిగాడు.

పరాశర సనత్కుమార శుకయోగీంద్రులు మువ్వురును భక్తి వినయంబుల పెంపొంద "పరమేశ్వరా! బ్రహ్మవై లోకములను సృజించుచున్నవాడనీవు—విష్ణువై ప్రపంచములన్నిటిని పోషించుచున్న వాడనీవు—, మహేశ్వరుడవై సర్వమును లయము చేయుచున్నవాడనీవు. జగతికంతకును నీవేకర్తవు, భర్తవు, హర్తవు. అష్టవసువులు ఏకాదశరుద్రులు ద్వాదశాదిత్యులు నీవైన సురముని గణ వంద్యుడవు. సమస్త సూర్యచంద్ర గ్రహమండలంబును నీ సంకల్ప ప్రభావంబుననే అనంతము నందు నిలిచివెలుంగుచున్నవి. తలంచితివేని కనురెప్పపాటు కాలంబున నీపదునాల్గు భువనభాండంబుల ప్రళయాంబుధిలో మునిగిపోవుట కెట్టి సందియంబును లేదు. మఱల నీ మనంబు నందునుకొను చుండగనే చరాచర వస్తుజాలంబుతో గూడిన సృష్టియంతయు నవతరించు చున్నది. నీవే యజ్ఞమూర్తివి. నీవే వేదస్వరూపుడవు నీవుకానిది—నీవులేనిది ప్రపంచము నందెందును లేదు. సదానందనీయుండవగు దక్షిణామూర్తిదేవా! మాయందు దయాదృష్టి ప్రసరింపజేసి మాకు శివాద్వైత రహస్యము నామూలాగ్రముగ నెఱింగించి మా యజ్ఞానములను బాపు" మని ప్రార్థించారు.

దక్షిణామూర్త్యంశ యం దావిర్భవించిన మహేశ్వరుండా మునులు మువ్వురు చేసిన స్తోత్రమున కానందించిన వాడై "యోగీంద్రులారా! మీ యందు నాకు ప్రేమాభిమానము లున్నవి కావున మీరు కోరిన వేదాంత రహస్యము లన్నింటిని సాంగోపాంగముగా బోధించెద" నని వారికద్వైత తత్త్వస్వరూపంబును— అందలి రహస్యముల నెఱింగించిన యనంతరమున

మునిశ్రేష్ఠులారా! నేనుమీకు ప్రసన్నుండనైన చైత్రశుద్ధదశమీలు నాడెవరై ననుగాని యీశివానందైక్య క్షేత్రమందలి బ్రహ్మవిద్యాతీరమున స్నాన మొనరించి వటవృక్ష మూలమున చిత్తశుద్ధి గలిగి దక్షిణామూర్తినిగ నన్నా రాధించిన యెడల వారికిపుడు నాచే చెప్పబడిన యద్వైత సిద్ధాంత రహస్యం బంతయు నాత్మగతంబగుటకెట్టి సందేహము నుండదు. మీరంత సదా నన్ను సేవించి ధన్యులు కండని చెప్పి యదృశ్యమయ్యాడు.

అవ్విధంబున బ్రహ్మదేవుని యుపదేశము ననుసరించి శ్రీకాళహస్తీశ్వర నిలయంబున దక్షిణకైలాసంబున కేతెంచి సువర్ణముఖియందు స్నానాదులు నెరవేర్చుకొనిన తరువాత వటవృక్ష మూలంబున నాసీనులై దక్షిణామూర్తిరూపంబున ప్రసన్నుడైన పరమశివమూర్తి దివ్యానుగ్రహము పొందిన మునికుమారులచ్చట భక్తిప్రపత్తులతోడ శివలింగముల ప్రతిష్ఠలు చేసి సేవించారు. వారిలో సనత్కుమారుండు ప్రతిష్ఠించిన లింగమునకు సనత్కుమారేశ్వరుండనియు, శుకయోగి ప్రతిష్ఠయైన లింగమునకు పరాశరేశ్వర లింగమనియు ప్రసిద్ధ నామము లేర్పడినవని బ్రహ్మదేవుడు వారికి చెప్పాడు.

## అగస్త్య భృగు మునుల పంతములు

అదొకనాటి బ్రహ్మసభ. నిజానికి సత్యలోకము కాదు—బ్రహ్మదేవుని నిలయమూ కాదు. బ్రహ్మదేవతలు మనలంతా కలిసి ఒకప్పుడు

కైలాసం వెళ్ళారు. శంకరుడు వారందరికీ మర్యాదలు చేయించాడు. ప్రమధ గణమంతా వారికి విడిదిభవనంచూపి కావలసిన వసతులను కల్పిస్తున్నారు. నందీశ్వరుడు బృంగీశ్వరుడు వీరభద్రుడు మొదలైనవారా అతిధులకేలోపమూ కలుగకుండ పరామర్శలుచేస్తున్నారు.

విశ్రాంతి భవనమందున్న వారందరిలోను బ్రహ్మ పెద్దయ్యాడు. మాటల సందర్భంలో "శివుడెక్కువా! బ్రహ్మయెక్కువా" అన్న సమస్య తలయెత్తింది. ముందుగ భృగుముని పూనుకొని "విష్ణుసర్వ వ్యాపకుడు. మహాబలవంతుడైన నాగేంద్రుడా యనకు మృదుతల్పం. ప్రపంచంలో సర్వ ప్రాణులకు ప్రేమానురాగాలను కలిగించే మన్మధుడతని కుమారుడు. వాని చేతి సుదర్శన మెంతమందో దుష్ట రాక్షసుల నంతమొందించింది. కనుక శ్రీమన్నారాయణమూర్తిని మించిన గొప్పదైవమెందునులే"డని సిద్ధాంతీకరించాడు.

వెనువెంటనే పనిగట్టుకొని అగస్త్యముని "భృగూ! నీవు చెప్పినదంతా బూటకం. శంకరుడు సర్వేశ్వరుడు. మహామయా స్వరూపిణి యైన ఆదిశక్తి వాని కర్ధాంగిలక్ష్మి. నీవు చెప్పిన ఫణిరాజాయనకు కంఠమాల. ప్రపంచంలో అందరి కార్యముల ననుకూలములు సేయు వినాయకుడు వానికి ముద్దులకొడుకు. లోక భయంకరమైన త్రిశూలము వాని యాయుధము. అంతయెందుకు? ముకుందునిచే గౌరవింపబడుచున్న శివుని ముకుందప్రియుడనడం మీరెరుంగనిదికాదు. కావున శంకరుని వంటి దైవమింకొకడు లేడనుమాట యదార్థం"

అన్నాడు. మరికొంత సేపటికి వారిద్దం వాదనలు తీవ్రరూపములు దాల్చి ప్రతినల దాకా వచ్చినై.

బ్రహ్మదేవుడంతట లేచి వారిరువురను సమాధాన పరచ ప్రయత్నించు నంతలో సభయందున్న మరికొందరు పెద్దలు కలుగజేసుకుని "అయ్యలారా! మీలో మీకీ పంతాలెందుకు? విష్ణుమూర్తి భృగుమునికి సర్వ పూజితాధికార మిచ్చినట్లయితే నారాయణుడే గొప్ప—లేక సాంబమూర్తి అగస్త్యఋషికి సర్వపూజితాధికార మిచ్చినట్లయితే శంకరుడు గొప్ప" యని తీర్మానించారు. ఈ నిర్ణయం చాల బాగున్నదని బ్రహ్మగూడ బలపరిచాడు. అగస్త్య భృగుమునులు గూడ సరే నంటె సరే నన్నారు. అంతటితో సభ ముగిసింది—ఎటువారటు పోయారు.

భృగుముని సరాసరి వైకుంఠానికి పోయి యిందిరా రమణునితో "దేవ దేవా! అనుకొనకుండ నేనొక పంతంలో పాల్గొనవలసి వచ్చింది. మాట పట్టింపులు వచ్చినై. బ్రహ్మదేవుడును దేవతలు మునులము కూర్చుండియున్న సభలో హరిహరు లందెవరధికు లన్న ప్రశ్న వచ్చింది. ఆ సందర్భంగా నేను శివుని కన్న మాధవుడు గొప్పవాడన్నాను. అగస్త్యుడు నన్నెదిరించుతూ "కాదు. కేశవుని కన్న శంభుడు గొప్పవా" డన్నాడు. చివరికా వాదనలు పంతాలుగా మారినై. చివరి కందున్న వారిచ్చిన తీర్పునకు మేమంగీకరింపక తప్పినది కాదు. కావున పీతాంబరా! మీరు నాకు సర్వపూజితాధికారమును ప్రసాదించి నాపరువు కాపాడవలయు" నన్నాడు. వైకుంఠేశ్వరుడందుల కామోదింపక పోవుటయేగాక భృగుమునిని మందలించుటయు జరిగింది.

ఓయీ! నీవా పని యేల చేసితివి? సాంబశివుని మహిమ నీకు తెలియదా! దక్షయజ్ఞ కాలంబునాటి వీరభద్ర విజయము నీకు తెలియనిదా! ఒకానొక సమయంబున పార్థివ లింగమై నిలిచిన శివుని తుది మొదలులు తెలిసికొన ప్రయత్నించి బ్రహ్మ హంసరూపమును దాల్చి గగన మండలము దాటి పోయినను అంతముగానక తిరిగి వచ్చినదియు—నేను వరాహ రూపమును దాల్చి పాతాళము క్రిందిదాకను పోయి వాని పాదదర్శనము గాకతిరిగి వచ్చిన విషయములు గూడ నీవు మరచితివా! నేనా శివుని కంటె గొప్పవాడను కాను గదా! వానికి సమమైన వాడను గూడ కాజాలను. నీవు తొందరపడి శివదూషణ చేసితివి కావున నింతటనైనను వివేకవంతుడవై పార్వతీపతిని క్షమాపణ గోరుకొను" మని చెప్పగా భృగువు లజ్జావదనుడై వెనుకకు తిరిగి వచ్చాడు.

అగస్త్యముని దక్షిణకైలాసంబున కరుదెంచి సిద్ధిక్షేత్రము నందొక స్వయంభూ లింగమును నెలకొల్పి యభిషేకింప దలంచాడు. కాని వానికా సమీపము నందొక తీర్థమును కల్పించుకొని, అందు స్నానాది విధులను నెరవేర్చుకుని లింగారాధనాది దైవకృత్యములతో కాలము గడుపుచుండగ నూరు సంవత్సరములు గడచినై.

# సమ్మోహన భైరవమూర్తి

అగస్త్యముని చేయుచున్న శివారాధనలను చూచి భృగుమునికి యీర్ష్య కలిగింది. ఎలాగునైన వాని తపసు భంగం చేయాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగ స్వర్గలోకానికి పోయిన భృగువున కా దేవేంద్రుడు అర్ఘ్య పాద్యాదుల నిచ్చి గౌరవించిన యనంతరమున "మహామునీంద్రా! మీరిపుడు మమ్మ జూడ వచ్చిన పనియేమి?" టన్నాడు. మునీంద్రుడు సంతసించి "దేవేంద్రా! ఏం చెప్పమంటావు? రాజ్యభోగాల నాసింపక కేవలం వైరాగ్యంతో గొందరికి అధికార వ్యామోహం కలుగుతూంది. అగస్త్యముని స్వర్గాధిపత్యం గోరి యిపుడు ఘోరమైన తపసు చేయుచున్నాడు. నీయందు నాకభిమానం కనుక నీ యింద్రపదవికి భంగం రాకూడదని ముందుగ నీకు చెప్పడానికే యింతదూరం పనిగట్టుక వచ్చాను. ఇక నీ చింతామణి పీఠాన్ని నీ వెలాగ నిలుపుకుంటావో నీయిష్టం" అని వూరుకున్నాడు.

ఆ మాటలు వింటూనే దేవేంద్రుని కన్ను లెఱ్ఱబడినై. గట్టిగా హుంకరించాడు. వజ్రాయుధంతో అగస్త్యుని చంపివేస్తానని లేచాడు. అంతలో భృగుముని దేవేంద్రుని కూర్చుండబెట్టి "అంతపని మాత్రము చేయకుము. అగస్త్యుడనిన సామాన్యుడా! వానిని సంహరించినందున నీకు మునిహత్యా పాతకమే కాకుండ శాపమైనను కలుగవచ్చును. అందుకని అపాయము లేని యుపాయమేదైనా వుంటె ఆలోచించు" మన్నాడు. దేవేంద్రున కామాటలు

సబబుగానే తోచినై. వెంటనే రంభ ఊర్వశి మేనక ఘృతాచి తిలోత్తములను రావించి "భూలోకంలో దక్షిణకైలాసాచలం మీద అగస్త్యుడు తపసు చేస్తున్నాడు. మీరక్కడకు పోయి వాని తపసుభంగం చేసిరండి" అని నియోగించాడు. దేవేంద్రుని యనుమతి ప్రకారం దేవవేశ్యలు క్షణమైన నాలసింపక కాళహస్తిక్షేత్రమునకు వచ్చి అగస్త్యముని ముందర ఆడిపాడీ ఆనందమయం చేశారు.

అగస్త్యుడు చలింపలేదు. కాని దివ్యదృష్టితో వారి ప్రయత్నం తెలుసుకున్నాడు. తన తపోబలంతో నొక దివ్యపురుషుడు నుదయింప చేశాడు. ఓయీ! నేను చేయుచున్న నాతపోదీక్ష కంతరాయము గలిగింప గొందరు వచ్చుచున్నారు. అది జరుగరాదు. నిన్ను క్షేత్రపాలకునిగ నియమించుచున్నారు. ఎవరు వచ్చినను సరె మొగమాట పడక నను సమీపింప నున్న వారిన పారద్రోలు" మని చెప్పి మరల దీక్షవహించాడు.

ఇంద్రుని పనుపున వచ్చిన అప్సరసలు పరాజయం పొందినా నిరుత్సాహ పడక మరల ప్రయత్నించు తలంపున వచ్చుచుండ క్షేత్రపాలకుండగు భైరవుడు వారల వంక భయంకరంగ గ్రుడ్లురిమి చూడడంతో వారు బెదిరిపోయారు. కాని అది చూచిన భైరవునకే జాలివేసింది. ఆడువారిని భీభత్స పరుప నిష్టము లేనందున సుందరరూపం దాల్చి దేవవేశ్యలను మోహింప చేశాడు. అప్సరసలు సమ్మోహన బద్ధులైకదలక మెదలక దిష్టిబొమ్మలట్లు నిలిచిపోయారు. అగస్త్యుని తపసు ఫలించింది. ఆ కారణంబున క్షేత్రపాలకునకు సమ్మోహన భైరవు డనియు. అగస్త్య విఘ్ననాశకు డని పేరులు వచ్చినై.

పరమేశ్వరు డంతట ప్రత్యక్షమై "అగస్త్యా! నీకు నాయందు గల భక్తి శ్రద్ధాభిమానములు సామాన్యములు కావు. ఎన్ని యాటంకములు వచ్చినా దీక్షవిడువని నీకు కోరిన వరముల నీయవచ్చాను. కావలసిన వానిని కోరుకో" అన్నాడు. తాపసేంద్రుండు వినయంబున "శంకరా! భక్తవశంకరా! భృగుముని ముఖంబున శివనింద వినిన నాపాప మంతరించుటయే నాకు కావలయు" నని కరముల ముకుళించాడు.

అంత మందహాస మొనరించిన మహాదేవుండు "భక్తాగ్రణీ! నీవడిగిన వాంఛనెరవేరియే యున్నది. ఇకనీవడుగక పోయినను నీకు కావలసిన లేవియో—నీకు నేనీయ దగిన వేవియొ నాకు తెలియక పోలేదు. నీవు నిర్మలాత్ముండవై తపమొనరించిన యీక్షేత్రము అగస్త్యక్షేత్రము—లేక, సిద్ధిక్షేత్రమనియు పేరు చెందగలదు. నీకు విఘ్నములు రానీయకుండ కాపాడిన భైరవునకు నీవభిలషించిన చందంబున సమ్మోహనభైరవ నామంబు వెలియాగలదు. ఎవరైననుగాని యీమాఘబహుళ చతుర్దశి పుణ్యదినంబున యీజ్ఞానప్రకాశిక తీర్థంబున స్నాతలై సమ్మోహభైరవమూర్తి స్వామిని సేవించిన వారికి సర్వాభిష్టములు సిద్ధించి శివసాయుజ్యము ప్రాప్తింపనున్నది. నీవింక పోయిర"మన్నాడు.

జ్ఞానప్రకాశిక తీర్థముచెంత సమ్మోహన భైరవమూర్తి నిలిచి యున్నాడు.

# పాతాళగంగ - పాతాళ విఘ్నేశ్వరుడు

శివానుగ్రహం పొందిన తరువాత గూడ అగస్త్యుడు కొన్నాళ్ళక్కడనే వున్నాడు. తక్కిన మునులంద రాయననొక గురుతుల్యునిగ గౌరవించుచున్నారు. ఆయనమాట నక్కాడున్న వారెవరూ కాదనువారులేరు. ఇంతకూ అగస్త్యుడంటె మునిలోకంలో పేరు ప్రతిష్ఠలు కలవాడు. పూర్వమొకప్పుడు పెరిగే పెరిగే వింధ్యపర్వతాన్ని పెరగకుండ నిలిపివేశాడని—సముద్రంలోని నీటినంతా అరచేత సాపోసన పట్టాడనే కీర్తి వారికిదక్కింది. ఇపుడీ యీశ్వర సాక్షాత్కారం ప్రత్యక్ష ప్రమాణ మయినప్పుడాయన గొప్పతనాన్ని అంగీకరింపని వారెవరుంటారు?

మునులంతా వారి దినచర్యలను ముగించే సమయం.

"అగస్త్యమహాముసీ! జ్ఞానప్రసూనాంబికా శ్రీకాళహస్తీశ్వరస్వామికి నిలయంబైన యీ శివానందైక్యసిద్ధి క్షేత్రమునందు నిత్యదేవతార్చనలకు గాని, యాత్రికుల స్నానపానాది సౌకర్యములకుగాని, ప్రకృతి రమణీయమునకుగాని తగినంత నీటి సౌకర్యము లేకపోవుట తీరని కొరతగనే యున్నది. ఆకొరత నీవలన దీరవలయునని దైవసంకల్పం, నీవు సంపాదించుకొనిన దివ్య తపః ప్రభావంబున యీక్షేత్రము నందొక నదీప్రవాహమును రూపొందింపజేయు"మనే మాటలు వినబడినై. ఎక్కడ నున్న ముని లక్కడనే తల

లెత్తిచూచారు. ఎటుచూచిన యెవరి కెవరూ కనపడలేదు. ఆమాట లెవరు చెప్పినవో గూడ యెవరికి బోధపడలేదు.

తరువాత మునులంతా అగస్త్యక్షేత్రం చేరుకున్నారు. అదొక చిన్న సమావేశమనుకుందాం. ఇంతకు ముందు మాటలు మేమువిన్నామంటె మేమూ విన్నామన్నారు. ఎవరు చెప్పారంటె యెవరుచెప్పారన్నారు. మాకు తెలియ దంటె మాకుతెలియదన్నారు. వారిలో ఒకపెద్ద "అవి మానవుని నోటి మాటలు కావు. భగవానుని యాదేశం ఎవరి సంకల్ప మయినప్పటికి యీ క్షేత్రంలో నదీప్రవాహ మేర్పడడమనేది లోకకల్యాణమున్కై కారణమైన దనక తప్పదు. సర్వసమర్థుడైన అగస్త్యుడే దీనిని సాధింపదగినవా"డన్నారు మిగిలిన వారంతా "మేముకూడ మీతోనేకీభవిస్తున్నాం" అన్నారు. అందరూ కలిసి అగస్త్యుని మీద ఒక మహాకార్యభారం మోపారు—ఆయన తలవం చాడు.

నది నుదయింప చేయడానికి మాలోచించిన అగస్త్యుడు ముందుగ విఘ్ననాయకుని దయ సంపాదించాలనకున్నాడు. అంతకు ముందే గజాసుర దానవునితో భయంకరంగ పోరాడి చివరికాతనిని సంహరించి వచ్చిన వినాయ కుడు వాయులింగానికి వాయువ్యదిశయందున్న పాతాళబిలంలో బడలిక తీరుచ్చ కుంటున్న సంగతి తెలిసికొని, అక్కడకు గణపతి ననేకవిధంబులుగ స్తోత్రము చేసిన యనంతరమున "సిద్ధివినాయకా! మీరీ పాతాళబిలము నందే నిలిచియుండి భక్తాదుల పాలింపవలయునని నా ప్రార్థన. అంతేకాకుండగ యీ క్షేత్రమున నీటికొఱంతలేని నదీప్రవాహము నుదయింపజేయ సంకల్పమై

యున్నది. దాని కనువైన ప్రదేశంబు నెఱింగించి నాకార్యమునిరాటంకముగ నెరవేర్చు"మని నమస్కరించాడు.

అగస్త్యస్తోత్రమున కానంద పరవశుడైన గణపతి చివాలున లేచి ఒకచోటున తనచేతితో ముమ్మారులు మన్ను తీయగ నచట నేలపల్లమై నీటి జలప్రారంభమయింది. చిన్నయూటగ మొదలైన యానీటిజాలు చూచుచుండ గనే నదీరూపం దాల్చింది. అంత గజాననుండు మునీంద్రునితో "ఓయీ! పాతాళబిలమం దుదయించిన యిదే పాతాళగంగ. ఇందు గ్రుంకువిడినవారికి కార్యసిద్ధికల్గుట నిశ్చయము. ముందు నీవే యీపాతాళగంగలో స్నానమొన రింపుము. తరువాత నీనది గొప్పదగు నుపాయంబు నేనెరింగించెద"నన్నాడు అందువలన అందున్న గణపతికి పాతాళ విఘ్నేశ్వరనామము కలిగింది.

# భయ భ్రాంతి నొందిన బ్రహ్మదేవుడు

పాతాళగంగా స్నానమొనరించి వచ్చిన మునీంద్రుడు భక్తివినయం బుల ప్రణామంబు లొనరించి "మహాత్మా! లోకకల్యాణమునకై తలపెట్టిన నాసంకల్పము సఫలీకృతం బయ్యెడి మార్గం బెఱింగింపు"మనిన నాలంబోద రుండును ముదమొంది "అగస్త్యా! కలికాలమందలి పాపులు జన్మ జన్మాంతర సంచిత కర్మఫలంబులనుండి విముక్తి పొందుటకుగాక యిందు నీస్వార్థము

లేదని నేనెరుంగుదును. మంచిపనులు సేయువారికి దైవమెప్పుడును తోడ్పడు చుండు నను పెద్దలవాక్యము వ్యర్థము కానేరదు.

మనకిచట పన్నెండామడల దూరమున పడమరగ బ్రహ్మగిరి యను పేరున నొకపర్వతమున్నది. నీవిప్పుడు మరచిపోయితివేమోకాని నీకాకొండ పూర్వపరిచయమైనదే. నీవు వింధ్యాచలము నడగద్రొక్కి దక్షిణాభిముఖగ పయనించినపుడు నీవాబ్రహ్మగిరి యందైదుదినములుండియే కుటజాచలమున కేతెంచితివి. కావున నీవిపుడచ్చటకేపోయి కొంతకాలము తపమాచరించితి వేని నీవభిలషించిన చందంబున నదీప్రవాహ మావిర్భవింపగల"దని వచించి నంత మునివరేణ్యుండును "చిత్త" మనుచు వినాయకుని యొద్ద సెలవుపుచ్చు కొని తన అనుయాయులతో బ్రహ్మగిరికి తిరిగి పోయాడు.

బ్రహ్మగిరి యందున్న ఋషులందరును అగస్త్యముని కెదురేగి యుచిత మర్యాదల గౌరవించి వారికిందగిన నివాసయోగ్య ప్రదేశంబులను చూపారు. ముని శ్రేష్ఠుండును పాతాళ విఘ్నేశ్వరుండు చెప్పిన చొప్పున నియమబద్ధంబుగ దీక్షబూని గోరతపను చేయనారంభించాడు. వాని తపోవేడి మికి లోకలోకాలు తల్లడిల్లిపోయినై. అందుదయించిన మహాగ్నిజ్వాలలు దశదిశల వ్యాపించనై. ప్రజలలో హాహాకారాలు మిన్నుముట్టినై. ఏమిచేయా లనో—యీ ప్రళయమునెట్లు తప్పుకొనవలయునో దరిదోవలు తోచని బ్రహ్మదేవుడు పరుగెత్తుకపోయి శంకరునితో చెప్పుకున్నాడు.

పరమశివుండంతట పద్మాసనునకు ధైర్యముచెప్పి "చతురానన ! అగ స్త్యముని యింతకఠిన తపం బాచరించుచున్నది బ్రహ్మత్వమొ—విష్ణుత్వమొ

—శక్రదత్వమో—ఇంద్రదత్వమో—మరేదియో పొందవలయునను మమకారం బునకాదు. దక్షిణకైలాస మందలి కాళహస్తీశ్వరక్షేత్రము నీకు తెలియనిది కాదు. అది ప్రసిద్ధిచెందిన శివక్షేత్రమయ్యేను యాత్రికులకు సౌకర్యమును కలిగించునట్టి నదీప్రవాహముచటలేదు. ఆకారణమున నందున్న సకలపాప హరణంబులైన తీర్థములుండియు, మహిమాన్వితములైన క్షేత్రములుండియు, ప్రసన్నులై వరము లీయగల దేవతామూర్తులుండియు ప్రయోజనము లేక పోవుచున్నది. గగనవాణి యగస్త్యునకు నీవాప్రదేశంబున ప్రవాహము నవ తరింపజేయుమని ప్రబోధించినది. దైవప్రేరణమున నమ్ముని వరుండు పాతాళవిఘ్నేశ్వరుని యనుమతిపొంది యీతపం బొనరించుచున్నాడు. ఇది లోకోపకారమునకేగాని యపకారమునకు కా"దని వివరించి చెప్పాడు.

భవుని మాటలతో భయము తీరిన బ్రహ్మదేవుడు ఆకాశగంగను వెంట బెట్టుకుని సరాసరి బ్రహ్మగిరికిపోయి "అగస్త్యమునీ! నీకోరిక ఫలింపజేయ డానికే వచ్చాను. దీక్షాబద్ధమైన నీయుగ్రతపంబునింక విరమించి" లెమ్మని నంతనే మునివరేణ్యుండు లేచి బ్రహ్మదేవుని పాదంబుల కంజలిమోడ్చి "పితామహా! మీదర్శన భాగ్యంతో నేను కృతార్థుడనయ్యాను. ఆదినుండియు భరతఖండము భగవానుని లీలలకు పుట్టినిల్లు. తాపసేంద్రుల కొటపట్టు ఐనను యీ బ్రహ్మగిరి నుండి శ్రీకాళహస్తీశ్వరాచలము వరకును మధ్యనున్న మహనీయులు జపతపహోమాదులు సేయుటకు తగిన నీట యొనరులు లేక యిబ్బందుల పడుచున్నారు. యాత్రికులకు భక్తులకు, ప్రయాణికులకు ప్రవా హోదక మవసరమైయున్నది. కావున యీబ్రహ్మగిరినుండి తూర్పు సము

ద్రము వరకును పయనింపగల యొకనది నుదయింపజేయ తలపెట్టిన నాయభి మతంబునీ దేర్పజేయుడని ప్రార్థించాడు.

# స్వర్ణముఖీ నదీ ప్రభావము

ఉత్తమాశయ సంపన్నుడైన అగస్త్యుని వినయోక్తుల కంతయు నానందించిన వాణీధవుండు ముని వర్యుల వారి యభిసంధి నెరవేరు గాక యని యాశీర్వదించాడు. తనప్రక్క నిలవంబడి యున్న యువతి పాతాళము నుండి వచ్చిన గంగయని గ్రహించి నందున "గంగాదేవీ! పరమేశ్వరాదేశానుసారముగ చెప్పుచున్న నామాట ప్రకారముగ నీవు లోకకల్యాణార్థ మీ ప్రదేశమున నందీరూపమునందవతరింపుము. అందులకు నీవీ యగస్త్యముని ననుసరింపుము. వారివెంట నేతెంచు" మనిన భగవతియు బ్రహ్మదేవుని యానతి నతిక్రమింపక నందీరూపము ధరించి పయనించి సాగరసంగమ మగుచున్నది. అదియే నేడు సకల పాపహరణంబైన సువర్ణముఖీ నది.

ఈనది యందలి యిసుక బంగారము వంటి రంగు గలిగి యున్నందువను దీనిని సువర్ణముని యనుకుండిరట. ఇందలి నీరు నిర్మలము. ఉత్తరాయణ పుణ్య కాలాన నెవరైనను సువర్ణముఖీ నదిలో స్నాతలై, జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీకాళహస్తీశ్వర స్వామిని సేవించి, అగస్త్యమునిని స్మరించినవారికి

రుణత్రయంబు దీరుట కెట్టి సందేహమును లేదు. అదిగాక గోదావరి, కృష్ణ, బ్రాహ్మపుత్ర మొదలైన ద్వాదశ జీవనదులలో పుష్కరప్రభావము సంవత్సరమున కొక్కొక్క నదియందే ప్రభవించుచున్నది కాని యీ సువర్ణ నదియందు ప్రతిసంవత్సరమును మాఘమాసమునందు మఘా నక్షత్రమున్న తరుణంబున పుష్కరవైభవము జరుగుచున్న విశేషము గమనింపదగినదై యున్నది.

సువర్ణముఖి చిత్తూరు రాజమార్గమునకు ప్రక్కగ ఆంజనేయగుట్టకు వెనుక భాగంబున అగస్త్యాచల మందు సన్నపాయగ బయలుదేరి భీమ కల్యాణి నదులతో సంగమించి కొండవాడకు సమీపముగ అగస్త్యేశ్వరాలయము నకు ప్రదక్షిణము సేయుచు తూర్పుగా కొంతదూరము సాగి శ్రీకాళహస్తీశ్వరాలయమును దాకుచు ఉత్తరాభిముఖంగ కొంతదూరము ప్రవహించి మరల తూర్పునకు తిరిగి వాకాడు గ్రామంబున కించుక దూరంలో బంగాళాఖాతమున గలియు చున్నది.

అగస్త్యేశ్వరాలయానికి ఎదురుగ నీనదియందు గంగామతల్లి శ్రీపాదుకలున్నవి. ఆశ్వీయుజ పౌర్ణమీలు లందున—ముక్కోటి పర్వదిదినములందును ప్రత్యేకముగ నుత్సవములు జరుగు సంప్రదాయ మిచట నేటికిని జరుగుచునే వున్నది.

సువర్ణముఖీనదీ ప్రభావమును గురించి చెప్పబడుచున్న యొక కథయు గలదు. పూర్వము యాదవరాజీ యాలయమును నిర్మించి నపుడు పనివారికి వేతనము లిచ్చిన యజమాను లెవ్వరును లేరు. పనివారందరు స్వామివారి

దేవాలయ నిర్మాణమున పని చేయబోవుటకు ముందుగ సువర్ణముఖీ నదిలో యిసుకకుప్పచేసి గుర్తుపెట్టు కొందురట. సాయంత్రం పనినివిడి వేయగనే పనివాండ్రు నదిలోనికి వచ్చి వారు చేసిన కుప్పలో చూచుకొనగ యెవరెంత పనిచేశారో—ఎవరికెంత ప్రతిఫలం రాదగి యుంటుందో, అంత విలువైన బంగారము దొరుకుచుండెడి దన్న జనప్రతీతి యీనాటికిని విన్పించు చున్నది.

# సాలెపురుగైన ఊర్ణనాభుని కథ

అది కృతయుగం. గజాకాననము నందు వాయులింగము నారాధించి శివానుగ్రహము పొందిన బ్రహ్మదేవుడు సృష్టికర్తయై వుండగ విశ్వకర్మ భగవానుని కుమారులలోని వాడైన ఊర్ణనాభుడను వాడు సృష్టిరహస్య మెఱింగి బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి జేయ నారంభించాడు. అది చూచి రోష మొందిన బ్రహ్మ "ఓయీ! నీవు నాసృష్టి నపహేళన చేసితివి కావున చదలు పురుగువై పుట్టు" మని శపించాడు. శాపగ్రస్తుడైన ఊర్ణనాభుడు తన్ననుగ్రహింపు మని చతురాననుని వేడుకొనగ పరమేష్ఠి కాతని యెడల సదభిప్రాయము లేకపోయినను దేవశిల్పాచార్యుల వారి కుమారుడైనందున "ఆచార్య కుమారా! నీవు చదలుపురుగువై వుండియు చిరకాలము కైలాస పతిని సేవించిన పుణ్యఫలంబున శాపవిముక్తి పొందెద" వన్నాడు.

శాపవశమున ఊర్జనాభుడు సాలెపురుగై పుట్టి గజకాననము నందొక ప్రాంతమున చెట్టుకొమ్మను బట్టుకొని వుండగ శివలింగం కనపడింది. మిట్ట మధ్యాహ్న కాలపు ఎండలో శివుడెంత శ్రమపడుచున్నాడో ననుకున్న సాలె పురుగు తన సన్నని దారములతో శివలింగమునకు పైగా చుట్టు చెట్టుకొమ్మ లాధారం చేసుకొని పందిరి నల్లింది. కాని ఆ పందిరి యల్లినంత సేపైనను నిలువక గాలివాటమున తెగిపోయినది. ఎందులకో శివునిమీద భక్తిప్రపత్తు లంకురించిన సాలీడు విసుగు విరామములు లేక తెగిపోవుచున్న తన పంది రిని మరల మరల యల్లుచునే వున్న శ్రమ నంతయు చూచి పరమేశ్వరుడా సాలీని పరీక్షించాలను కున్నాడు. శివమాయ వలన ఒక సన్నని దీప మా సన్నదారాల కొల్చివేయు చున్నందున సాలీడుకు కోపం రెచ్చిపోయింది. ఆ దీపము నమాంతంగా మింగియైనా సరే తను సేవించుచున్న పరమేశ్వరు నకు నీడ కల్పించాలనే పట్టుదలతో దీపాన్ని సమీపించింది. సాలీని భక్తికా నందించిన పార్వతీరమణుండా దీపము నందే సాక్షాత్కరించి "నన్నింత భక్తి విశ్వాసములతో సేవించిన నీకేం వరం కావాలనో కోరుకొ"మ్మన్నాడు.

ఊర్జనాభునకు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. పశుపతిని ప్రస్తుతించిన తరువాత పురాంతకా! కాలాంతకా! నీభక్తి వాత్సల్యము నిరుపమానము కను కనే నన్ను కనికరించితివి దేవా! నేను విశ్వకర్మ పుత్రుడనైన ఊర్జనాభు డను. బ్రహ్మదేవుని శాపప్రభావంబున నిట్లు సాలెపురుగునై మీ సేవ చేయ గల ధన్యుడ నయ్యాను. నాకింక ప్రాపంచిక భోగములతో పనిలేదు. జన్మ దారణమున మాయామోహ బంధంబుల జిక్కి మరల నేయపరాధము గావిం చెదనో యను సంశయంబగు చున్నది. నాకింతటితో పునర్జన్మ లేకుండ

శాశ్వతానంద సిద్ధికరంబైన శివసాయుజ్యమునే ప్రసాదింపు" మని వేడు కున్నాడు. శంకరుండా భక్తాగ్రగణి మాటల కానందించి ఊర్జనాథా! నిష్కా మివై నీవు కోరిన కైవల్యము ప్రసాదించినాను. నీ చరిత్ర మీ ప్రపంచమున నాచంద్ర తారార్కముగ నిలిచిపోనున్న" దని వర మిచ్చాడు.

సాలెపురుగునకు "శ్రీ" అను పేరున్నది.

# శ్రీ కాళహస్తులందిన శివానుగ్రహము

కృతయుగం గడచిపోయి త్రేతాయుగం నడచుచున్న సమయం. మహాశివరాత్రీ పుణ్యదినం. భక్తులైన వారందరూ నిర్ణీత కాలాలలో లేచి కైలాసమునకు పోయి శివదేవారాధనలలో నిమగ్నులయ్యారు. అభిషేక ములు సేయు వారితో, బిళ్వదళార్చనలు సేయువారితో, ప్రణవోంకార జప మాచరించు వారలతో క్షేత్రమంతా కోలాహలంగా వున్నది. అదంతా చూచి గూడ కాళుడను మదోన్మాది శివపూజ చేయక పోవుటయే గాక దైవారాధనల యందాసక్తి కలవారిని పరిహాసము లాడాడు.

భగవత్స్వరూపు లొకప్పుడు తమ్ము దూషించిన సహించెదరు గాని తమ భక్తులను నిందించిన వారిని సహింపరు. అటులనే శంకరుడు తనభక్తుల నకారణంబుగ పిమర్శించిన కాళుని రావించి "ఓయీ! నీవీ పర్వడి దినమున

పరమభక్తుల నాక్షేపించితివి కావున నీవింక పాతాళలోకంబున జన్మింపు”మని శాసించాడు. పాతాళంబున కేగి చింతాక్రాంతు డైన కాళుండు క్షమాపణ కోరుకొనుటం జూసి కైలాసపతి కరుణించి “వత్సా! గతించిన దానికై చింతింపకుము. నీవు పాతాళము నందున్నను నీకు నా సాన్నిధ్యము లభింప నున్న”దని సమాధాన పరచి పంపాడు.

శాపగ్రస్తుండైన కాళుడు కొద్ది దినములలో పాతాళలోకంబున నాగ వంశంలో జన్మించాడు. ఒకనాడు భూతల మందలి కొన్ని ప్రదేశంబుల దిల కించుచు గజకాననమునకు వచ్చి పరిసరంబుల దిరుగుచు వాయులింగమును చూచినంతనే భక్తి వినయంబుల మోకరిల్లి లేచాడు. శివభక్తి యందు భ్రాంతి కలిగింది. అది మొదలు ప్రతిదినం వేకువజామున మేల్కాంచి శుచియై పాతాళమునుండి సులువైన మణులను దెచ్చి వాయులింగముపై నుంచి పూజింప సాగాడు. అలాగా త్రేతాయుగం గడచి ద్వాపరం ప్రవేశించింది.

అదటులుండ కైలాస మందలి ప్రమధగణము నందున్న హస్తి యనునా డహంకార పూరితు డయ్యాడు. ఒకప్పుడు గౌరీశంకరు లేకాంత ప్రసంగము లందున్న తరుణంబున ద్వారపాలకుని మాటలనైన చెవిబెట్ట కయే సరాసరి సమీపించి నిలువంబడి యున్న కారణమున పాలనయనుండు కోపించి “వినయ విధేయతలు లేక సంచరించిన నీవు భూలోకంబున మదపు టేనుగువై జన్మింపు”మని శపించాడు. శాపవచనంబు లాలకించిన హస్తి భీతి చేతంబున వామదేవుని పాదములపై వ్రాలి అపరాధమును మన్నింపు మని వేడుకొనగ దయాంతరంగుడైన పరమేశ్వరుడు పార్వతి వంక చూడగ నా

మంగళ గౌరి "వత్సా! పరమేశ్వరుని శాప మనుభవింపక తప్పదు. ఐనను నీవా కరిజన్మంబున నతిభక్తి శ్రద్ధల పరమేశ్వరుని సేవించుచుండుము. కొంతకాలంబునకు నీకు శాపవిముక్తి చేపడ గల"దని యూరడించి పంపినది.

గజకాననము నందు కరిణియై పుట్టిన హస్తి ప్రతిదినము కేతకీ నదీ జలములలో మునింగిన తరువాత తొండము నిండగ నీరు నింపుకుని వచ్చి వాయులింగము నభిషేకించి చుట్టుప్రక్కలందున్న చెట్లనుండి పత్రిని దెచ్చి యలంకరించి సేవించుకుని పోసాగింది. అది కాళునకు కోపకారణ మయింది. నేను పాతాళము నుండి విలువైన మణులను దెచ్చి నాస్వామి నలంకరించుచుండగ ప్రతిదిన మెవ్వరిట్లు నారత్నములను క్రిందకు బడద్రోసి ఆకులముల నింపువారని కొరకొరలాడుచుండ నేనుగుయు నేను స్వామి నభిషేకించి మారేడు దళముల పూజించుచుండ నెవరిట్లు ప్రతిదినము నాపూజాద్రవ్యములను తొలగించి యీపనికిమాలిన రాలనిచట బెట్టుచున్నదని పగబట్టింది. కొంతకాలాని కది పంతంగా మారి యొకరి నొకరు చంపుకొనుటకే నిశ్చయించుకున్నారు. కాని పగవారెవరో యెవరికిని తెలియక పోయింది.

ఒకనాడు ముందుగనే పాతాళము నుండి వచ్చిన సర్పము తన వైరిని గమనించు తలంపున నాపత్రియందే దాగి యున్నది. అటు పిమ్మట వేళ ప్రకారముగ వచ్చిన యేనుగు నాకు స్వామి యందు చెదరక లోగడదినము నందుంచిన పూవులాకు లట్లె యున్నందున సంతోషించింది. సువర్ణముఖికి పోయి జలము తీసుకుని వచ్చుటకు ముందుగ లింగము నందు తాను నిన్నటి దినమున నలంకరించిన నిర్మాల్యమును తీయ దలంచి తొండమున

నా పత్రపుష్పంబుల దీయబోయినది. అంతవరకందు దాగియున్న నాగ మదే యదనని తలంచి దాని తొండము నందున్న ముక్కు రంధ్రముల నుండి ఏనుగు తలలోనికి పోయి కలవర పెట్టసాగింది. మస్తకములో చేరిన చిలువ నేమి చేయలేకయు, తలబాధ భరింపలేకను కరీంద్రమొక కొండశిలమీద తల వైచి గొట్టుకొనక తలపగిలి హస్తియు. తలయందుండి దెబ్బతినిన నాగము గూడ యేకకాలమున మరణించినై. సాంబశివుడంతట సాక్షాత్కరించి గజ కాళంబుల ననుగ్రహించి తనయందైక్యము చేసుకున్నాడు.

పరమేశ్వరుడు దయామయుడు. ఆయనకు పక్షపాతము లేదు. భక్తి ప్రపత్తుల తన్ను సేవించిన దేవదానవ మానవులకే కాకుండ క్రిమి జంతు మృగంబులకు గూడ కైవల్యం ప్రసాదించి ప్రియవచనంబుల నాదరించాడు. తన నివాసక్షేత్రాని కా మువ్వుర పేరున "శ్రీకాళహస్తి" అని నామకరణం చేయించాడు. తాను శ్రీకాళహస్తీశ్వరుడ నని చెప్పుకున్నాడు. తన ప్రక్కగ సాలెపురుగు, నాగము, ఏనుగుల చిహ్నములములను గూడ రూపొందచేయిం చాడు. శ్రీకాళహస్తీశ్వరుని మించిన దైవము లేడనిపించుకున్నాడు.

# పశుపతి నోడించిన పాండవ మధ్యముడు

ద్వాపరయుగం జరుగుతూంది. ధరణీతల మంతా జయించి రాజ సూయం చేసిన పాండవులు కాలప్రభావంబున రాజ్య మోడి పోయారు. అడ

వుల పాలయ్యారు. ముందు భారత యుద్ధం జరుగ బోతుందని తెలిసికొన్నం దున అర్జునుడు పాశుపతాస్త్రం సంపాదించా లనుకున్నాడు. కృష్ణానదీ తీరాన నున్న యింద్రకీలాద్రి మీద తపోదీక్ష వహించాడు. అమరులది చూచి అబ్బు రం చెందాడు. పార్థుడెంత ప్రజ్ఞగలవాడో పట్టిచూడా లనుకున్నాడు. పర మేశ్వరుడు. మూకాసురుని పందిగ రూపొంద నియమించి అర్జునుం డున్న చోటుకు పంపి తానొక బోయవాని వేషం ధరించి ఆ యింద్రకీలాద్రి మీదనే తిరుగాడు తున్నాడు.

పార్వతీపతి పనుపున పరుగిడి వచ్చిన మాయవరాహం మున్యా శ్రమాల కేతెంచి కలవర పెట్టింది. మునుల కెగ్గు సేయుని ధనంజయు డా పందిని బాణంతో కొట్టాడు. మాయా నాటక సూత్రధారి యైన మహేశ్వరుడు కిరీటి కన్న మున్ను తనే పందిని జంపినట్లుగా దాని మేన బాణంబును నాటి యుంచాడు. వరాహమును గొట్టిన బంటు నేనన నేనని నరశంకరులకు వాదం పెరిగింది. సరసం ముదిరి విరస మయింది. ఒకరిని మించి యింకొకరు దివ్యాస్త్రముల ప్రయోగించారు. ఆ దృశ్యం చూచిన వారంతా భయపడి పోతు న్నారు. సవ్యసాచి శరలాఘవం చూచి సంతోషించిన మాయా శంఖపుండు తన దైవశక్తిచే అర్భదుని అంబులపొదిలోని బాణము లన్నింటిని మాయం చేశాడు. అంతకంతకు రోష మతిశయించిన ఫల్గుణుండు తన చేత నొక్క ములికైనను లేనందున చేతి వింటి నెత్తి భిల్లుని తలమీద గట్టిగ మోదాడు.

కిరీటి ధైర్యసాహసాల కెంతగానో మెచ్చుకున్న విటలాక్షుడు తన నిజరూపం దాల్చాడు. ఇంతవరకు తనపై పంతగించిన శబరుడీ శంకరుడే

నని గ్రహించిన కుంతీ తనయుడు పరమేశ్వరుని పాదములకు ప్రణమిల్లి "త్రిపురాంతకా! నన్ను కనికరింప నీవే ఈ రూపమున వచ్చితివా దేవా! నన్నెదిరించుచున్నది. నందివాహనులే యని నేననుకొనిన యెడల వరాహమును నేనే మీకు సమర్పించి యుండక సంగ్రామ మొనరించుతునా! మీ సాక్షాత్కారమునకై నిరీక్షించు చున్న నేను మిమ్మెదిరించు నంతవాడనా? తెలియక నేనొనరించిన యీ యపరాధమును మన్నించి కాపాడు" మని వేడుకొనగ మహేశ్వరుండు మందహాసం చేసి "అర్జునా! నీ సంకల్పము నేనెఱుంగుదును. నావలన పాశుపతాశాస్త్రము పొందదగిన యోగ్యత నీయందున్నదో? లేదో! గ్రహించుటకే యీనాటక మాడాను. నీవందులకుం దగిన వాడవె. ర"మ్మని చేరబిలిచి పాశుపత మంత్రోపదేశ మిచ్చి యాశీర్వదించాడు.

విరూపాక్షుని వలన దివ్యాస్త్రరహస్య మెరింగిన విజయుండు కరములు ముకుళించి పరిపరి తెఱుంగుల గొనియాడి "శంకరా! పాపభయంకరా! రాచబిడ్డనైననాకు శత్రుసంహారము ప్రధానమైనది. మీరు ప్రసాదించిన యీపాశుపతంతో పగతులను జంపి విజయముపొంద గలను. కాని బంధుజనంబుల నంత మొందించిన పాపము నన్నాపాదింప నవకాశమున్నది. బంధుహత్యాపాతక నివారణోపాయము చూపు"మని దోసిలి పట్టాడు.

అర్జునుని మనోవేదన నవగాహన చేసుకొనిన అభవు డాలోచించి "పాండునందనా! నీవన్నదియు నిజమైన మాటయే. రక్తపాతమున గాని రాజ్యలక్ష్మి చేపడదు. అది పాపహేతువనకను తప్పదు. కనుకనే రాజ్యపాల

కులకు చివరిలో నరకం తప్పదనికూడ ధర్మశాస్త్రం చెబుతూంది. కనుక నీకీ జన్మలో మోక్షము సిద్ధింపదు. రాబోవు జన్మలో కలియుగంబున నీవొక బోయవాని యింట బుట్టెదవు. నీకునాయందు మితిమించిన ప్రేమాభిమానంబు లేర్పడగలవు. భక్తిపారవశ్యమున నీవు నన్నానంద భరితాత్మునిగావించి శివాసాయుజ్యమును చెందగలవు. ఇప్పటికి పోయిరమ్మని చెప్పి యదృశ్యమయ్యాడు.

తరువాత భారతయుద్ధం పదునెనిమిది రోజులు జరిగింది. మహారథికుడైన యర్జునుడు పరమాత్ముడైన శ్రీకృష్ణుని సాయంతో కౌరవుల నందరినీ సంహరించాడు. పాండవులు హస్తినాపురానికి చక్రవర్తులై ధర్మపాలన చేశారు. శ్రీకృష్ణపరమాత్మ కృష్ణావతార విరమణతో కలియుగం ప్రారంభమయింది.

## తిన్నని బాల్యము - శివభక్తి

ఉడుమూరు దక్షిణకైలాసానికి చేరువలో నున్న చిన్న గ్రామం. అది బోయవారలకు కాపురస్థలం. అచటి వారందరకూ నాధనాధుడనువాడు పెద్ద. ఒకరూపంగా రాజని కూడ చెప్పొచ్చు. నాధనాధుని భార్యపేరు తందె. ఆటవికప్రదేశవాసులైనందున అచటివారందరు వేటాడి జీవింపవలసినవారే.

వారంతా శివభక్తులు. తండెనాథనాథులకు శంకరుడారాధ్యదైవం. కొంతకాలం గడిచేటప్పటికి వారికో మగశిశువు కలిగాడు. వారా కుమారునికి తిన్నడనే పేరుపెట్టి మిన్నగ పెంచుకుంటున్నారు.

తిన్నడు మంచిచురుకైన పిల్లవాడు. తోడిబాలురందరిలో దేనికైనను వానిదేపైచేయి. గుణవంతులలో గణనీయుడు. దగాకోరుతనం మోసకారితనాలు వాని దగ్గరనేలేవు. ఐతే మొదటినుండి పట్టుదలగలతత్త్వం. చేతబట్టిన దానిని చివరంటుదాకా విడిచిపెట్టడు. నమ్మినవానికోసం ప్రాణాలైనాయిస్తాడు తిన్నడంటె అసలే ఆగూడానికి రాజుగారబ్బాయి—అందుకు తోడు కలుపుగోలు తనానికి కొదువలేదు. తిన్ననిమాటకా పల్లెలో తిరుగులేదు.

ఆనాడు వారికి సంబంధించిన పర్వడిదినం, నాథనాథుని కుటుంబంతో బాటు గూడెంలోని గుంపంతా గాౖచేని పూజించారు. తిన్నడా వేడుకలు జరుపుకున్నాక వేటాడ బయలుదేరాడు. మృగాలను తరుముకుంటూ పరుగులెత్తిన తిన్నడు కేతకీనదీతీరం చేరేటప్పటికి డస్సిపోయ్యాడు. సమీపము నందలి తేవులో సేదతీర్చుకొనిన తరువాత ప్రక్కనున్న చెట్టుక్రింద శయనించాడు. అప్రయత్నంగానే నిద్రపట్టింది. కలగూడవచ్చింది. ఆకలలో తన చెంతకు వచ్చిన శైవాచార్యుడు "అబ్బాయి-! ఈదగ్గరలోనె ఒక శివలింగమున్నది. దానిని నీవు నమ్మి పూజించితే సాంబశివుడే స్వయంగ నీదగ్గరకు వచ్చి మోక్షమిస్తా"డంటూనే మాయమయ్యాడు.

తిన్నడంతట నిద్రలేచిచూచాడు. వానికెవరూ కనపడలేదు. అతని మనంబున కేవో వింత వింత యాలోచనలు రాసాగినై. అదేసమయంబున

కంటబడిన వరాహమును వెంబడింపసాగాడు. ఆపంది వానిని ముందుకు గొని పోయి యదృశ్యమయింది. దానికై పరిసరంబులందు వెదకుచున్న తిన్ననికి శివలింగం కనుపించింది. అది బోయరాజకుమారుండింటినుండి బయలుదేరిన వేళావిశేషమో—ఆలింగమును దర్శించిన లగ్నబలమో తెలియదుకాని యువకుని చిత్తమా శివలింగమందు నిలిచిపోయింది. ఆలింగానికి తనకేదో పూర్వ సంబంధాను బంధమున్నదన్నట్లుగ వానిలో మార్పుకూడా కలిగింది.

అతనికి తెలియకుండగనే అమాంతంగా లింగము నాలింగనం చేసుకున్న తిన్నడు "నీవిక్కడ నున్నావాస్వామీ! నన్నిక్కడి కెందుకు రప్పించావు? నీవెవరవు—నేనెవరను? మనయిద్దరికు యీసంబంధ మేనాటిది? కలలో కనపడి చెప్పిన మాటలు నాకిపుడేల చెప్పవు? నేనడిగినదానికి బదులాడవేమి? నీవు మాటాడకపోయి నంత మాత్రమున నేను నిన్ను విడిచిపోవుదు ననుకుంటివా? నీవు నావెంట మాయింటికి పోదాంరా. అక్కడ నీకేలోపమూరాకుండా నేను చూచుకుంటాను. నేనబద్ధమాడే వాడనుకాను. మాయమ్మా నాన్నలుగూడ చాల మంచివారు. వారుకూడ నీకన్నంపెడతారు—బట్టలిస్తారు—నీవు కోరింది చేస్తా"రంటూ పిచ్చెత్తిన వానిచందాన ప్రలాపించాడు.

ఇంటిదగ్గర నుండి తిన్నని వెంట బయలుదేరి వచ్చిన చెలికాండ్రాయనను వెదకుకుంటూ వచ్చారు. వాయులింగంతో ముచ్చటలు చెప్పుచున్న తిన్నని వారించి యింటికిపోదాంరమ్మని పిలిచారు. ఇక్కడుంటె చీకటిపడ్డాక దయ్యాలు భూతాలు వస్తాయి అనికూడ బెదరించారు. మీనాన్నగారు వచ్చి దండిస్తారని భయపెట్టారు. ఎన్నిచెప్పినా తన్నడు యింటికి రానంటె రాన

న్నాడు. బోయగూడెం బాలురకాతని పంతం మొదటినుండి తెలిసినదే కనుక మనమెంత ప్రయత్నించినా ప్రయోజనం లేదనుకొని తిరిగి యిండ్లకు పోయారు.

# తిన్నప్ప కన్నప్పయైన విధానము

ఎంత సేపు పిలిచినా—ఎన్ని మంచి మాటలు చెప్పినా శివలింగం కదల లేదు. మెదలలేదు సరికదా, పలికి మాటాడను లేదు. తిన్నని ప్రాణాలు విసిగిపోయినై. "ఔను. ఈ యర్ధ్వానపు టడవిలో యీయన కన్నమెవరు పెడతారు? ఆకలితో సొమ్మసిల్లిపోయి యుంటా" డనుకున్నాడు—తిన్నడు. విల్లు బాణాలు చేతపట్టుకుని అడవిలోనికి పోయి మదించిన జంతువుల్ని వేటాడి చంపాడు. మాంసం ముక్కలను మంటలలో మధురంగా యుండే లాగా కాల్చాడు. ఆకుదొప్పతో సువర్ణముఖిలోని నీరు తెచ్చి శివలింగాన్ని శుభ్రంగా కడిగి పొట్టుపెట్టాడు. ఆకులో నుంచిన మాంస మారగింప పెట్టాడు. కాని పాషాణ లింగం పలహారం తీసుకోలేదు. చిన్నని మనసు కది తీరని బాధయింది. భక్తిపారవశ్యంతో గొంతెత్తి వాపోయాడు.

అమాయకుడైన తిన్నని భక్తిశ్రద్ధల కచలవాసుడు ముగ్ధుడైనందున వాయులింగమందే అవతరించి చేయిచాచాడు. తిన్నడానందంతో బాగుగ వేగిన మాంసం ముక్కల నాతడు ముందుగ పంటగొరికి రుచిచూచి ఆయన

చేతిలో పెట్టుతున్నాడు. భక్తుడిచ్చిన యెంగిలిముక్కల నా భవానీపతి పర మాన్నం ముద్దలులా మెక్కుతున్నాడు. అప్పటి నుండి ప్రతిరోజు తిన్నడు మాంసం తెచ్చి పెట్టడం మహాదేవుడారగించడం మామూలయింది, ఎంత విచి త్రం? ఆనాడు భక్తలోక సంరక్షణకై కాలకూట విషాన్ని స్వీకరించిన మృత్యుంజయు డీనాడు బోయవాని చేతి యెంగిలి తినడంలో వింతపడదగ దంటూ యుండదు. శంకరుడలాగా యెంగిలి తిన్న కొండమైనందున శ్రీకాళ హస్తీశ్వరాచలాన్ని "యెంగిలి కొండ" అన్నారు.

అదలా జరుగుతుండగ కొన్నాళ్ళు గడచినై.

శివగోచరుడనే బ్రాహ్మణ యువకుడు ప్రాతఃకాలములోనే సువర్ణ ముఖీనదీ తీరాన స్నానం చేసి పత్రపుష్పాలతో వాయులింగము నారాధించి పోవుట కింతకుముందే అలవాటు పడ్డాడు. వాని కిటీవల నుండి స్వామిసన్ని ధిలో యీ మాంసము కనపడుచున్నందున మనో వికల్పం కల్గుతూ వచ్చింది. ఆయన యీ యనాచారం చూచి సహింపలేక పోయాడు. ఒకనాడా విప్రబాలుండు లింగాని కభిముఖంగా కూర్చుని "ఈశ్వరా! పరమేశ్వరా!" ఇక మీదట మీదగ్గర నిటువంటి అరాచకపు పనులేవీ జరుగకుండ చూస్తా" నని మీరు నాకు వాగ్దాన మీయకపోతే నేనిక్కడనే ప్రాయోపవేశం చేసి ప్రాణాల నొదులుతా"నని మొండికేసి కూర్చున్నాడు.

అది చూచిన చంద్రమౌళి ప్రత్యక్షమై "చిరంజీవీ! నీ యభిమతం నేను కాదనడం లేదు. ప్రతిదినమిక్కడ నీవనిచేయుచున్న దెహాం—ఎందు వలన నే నిందుల కంగీకరించి యున్నానో తెలిసికొన వలయు నంటె నీవటు

చాటుగ కొంతసేపు వేచియుండి చూడు. అంతా నీకే తెలుస్తుం” దన్నాడు. శివగోచరు డందులకు సరే నన్నాడు.

కొంతసేపటికి తిన్నడు రానే వచ్చాడు. తన మామూలు తప్పక దాను తెచ్చిన మాంసం ముక్కలను లింగం ముందుంచి తినమన్నాడు. ఆరోజు శివుడాహారం ముట్టలేదు. అది చూచిన తిన్నని కాలోచనలు కలిగినై. ఇన్నాళ్ళూ తిన్నట్లుగా యీనాడెందుకు తినవు స్వామీ! నీకు నేనేమైనా లోపం చేశానా! నేను తెచ్చిన భోజనం నీకు నచ్చలేదా! లేక నీకేమైనా జబ్బు చేసిందా!” అంటూ లింగం వైపు చూచాడు. శివలింగంలో రెండు నేత్రాలు వానికి కనపడినై. ఒక కంట నీరు కారుతూంది. శివుడు పెట్టిన కన్నీరు చూచి తిన్నని గుండె కరగి పోయింది.

పొంగివచ్చే దుఃఖాన్ని పొదివి పెట్టుకుంటూన్న తిన్నడు లేచిపోయి కొన్ని ఆకులు తెచ్చి రసం పిండాడు. శివుని కంటినీరు కట్టుపడక పోగా, ఉన్న కన్ను లొట్టపోయింది. తిన్నని మనసింకా దెబ్బతిన్నది. “నీకన్ను పోతే నాకన్నిస్తానుండు” అంటూ చేతి బాణంతో తనకంటి గ్రుడ్డు పెకలించి లింగంమీద నుంచగనే అది కంటిలో చేరి విప్పారింది. కాని, ఆ సంతృప్తి యెంతసేపో యుండక శివుని రెండవకన్ను నీరుకారింది. తిన్నడదిచూచి స్వామి రెండవకన్ను గూడ బాగుపడాలంటూ తన రెండవ కంటి గ్రుడ్డు గూడ పెకలించాలనుకున్నాడు. తన రెండు కన్నులు లేకపోయాక శివలింగం తనకు కనపడదు కనుక శివుని కన్నున్న చోటున తన చెప్పుకాలు బొటన వ్రేలు నదిమిపెట్టి తన రెండవ గ్రుడ్డును గూడా పెకలింప బోయాడు?

అంతలో తిన్నని యెవరో చేయిపట్టు "ఆగు. వత్సా! ఆగు. అన్నారు. తిన్నడు తన చేయి పట్టుకున్న వాని వంక తిన్నగ చూచాడు. ఆయనెవరో కాదు. ప్రత్యక్షమైన పరమేశ్వరుడు. తిన్నలిలో పామరత్వం హరించిపోయి దివ్యజ్ఞానం ప్రకాశించింది. పూర్వజన్మ స్మృతి కలిగింది. పార్వతీశ్వరునకు పాదాభివందనం చేసిన పాండవమధ్యముడు శివస్తోత్రం చేశాడు. అంత చంద్రకళాధరుండు శివగోచరుని చేరబిలిచి "అనాగరిక మానవుని అసాధారణ భక్తి యెట్టిదో చూచావా!" అన్నాడు. శివగోచరుని యజ్ఞాన మంతరించిన నందున నాతండు "కిరాతకుడై పుట్టినా తిన్నని భక్తి ప్రపత్తులే గొప్ప" వని ప్రశంసించాడు. అంత శివ గోచర ధనంజయు లిద్దరూ శంకరుని స్తవం చేశారు. ఆ కాళహస్తీశ్వరుడు వారిద్దరినీ తన యం దైక్యం చేసుకున్నాడు.

ముక్కన్నుల స్వామికి కన్నులిచ్చిన తిన్నని కిప్పుడు కన్నప్ప యనే పేరు వచ్చింది. ప్రధానలాయానికి ఆగ్నేయము నందున్న ఉన్నత మగు కొండమీద కన్నప్పాలయం వెలిసింది. శివాలయంనుండి కన్నప్పాల యమును చూడవచ్చును. ఈరెండు దేవళంబుల మధ్య నున్న మార్గముగూడ మెట్లతో రూపొందింది. ఇటీవల కొంత శిధిలములైన కట్టడములు బాగుచేయ బడి విద్యుద్దీపము లమరింప బడినందున యాత్రికులు సుఖపడుచున్నారు. మహాశివరాత్రి మొదలైన దినములలో కన్నప్పాలయ మందును మహోత్స వములు జరుగుచున్నవి.

# సంస్కారము తెలియని సత్కారుడు

పూర్వకాలంలో మగధ రాజ్యాన్ని పాండ్యరాజు పాలించేవాడు. ఆయన చాల గొప్పవాడు. బలపరాక్రమములతో శత్రువులను జయించాడు. నగరంలో దొంగ దోపిడి భయాలు లేకుండచేశాడు. దానధర్మాలతో ప్రజలకే లోపమూ లేని శాంతి భద్రతల నెలకొల్పాడు. కవులను పండితులను, గాయకులను, శిల్పులను పోషించి కళాభిమానియని పేరుగాంచాడు. అయన పాలనలో యెన్నో సాహిత్య సభలు జరిగినై.

ఒకనాడాయన సభ కరుదెంచిన కుంభజుండను మహానీయుడు రాజ మర్యాదల పొందిన తరువాత "భూపాలా! నీవు ధన్యుడవు. ఆనందవల్లి అమృతవల్లి కర్పూరవల్లి కల్పకవల్లి మాణిక్యవల్లి యనిపేరుగాంచిన జగన్మాత మీనాక్షీదేవి క్షేత్రపాలకురాలై వెలసిన యీమధురరాజ్య సింహాసనం నీకు దక్కింది. సప్త సంతానముల పొందితివి. ధనవంతుడవు—బలవంతుడవు—గుణవంతుడవునైన నీవైభవము లోకకల్యాణమగును కావున నీకు నేనీ శంఖఫలకమును బహూకరించుచున్నాను. ఇదిఅష్టాదశ బీజాక్షర సంపుట ప్రభావం కలది. ద్రవిడభాషా విశారదకవి కూర్చుండదగు మరియొక చిత్రమేమంటివేని త్రేతాయుగము నాటి పుష్పక విమానము వలె దీనిమీద యెందరు కూర్చున్నను వారికి వలయుచోటు నిచ్చుచునేయుండును. ఇది మీయట్టి ప్రభువుల చెంత నుండదగిన దంటూ"చెప్పి వెడలిపోయాడు.

కాలచక్రము దొర్లిపోవుచున్నది. కాలచక్రముతోబాటు రాజులు మారుచున్నారు. పాండ్యరాజుల తరువాత పాండ్యరాజ్యమేలిన వారిలో యీ భూవరుండును సర్వ సమర్థుడు. ఈనరేంద్రుండును విద్యారంగమునసు ప్రసిద్ధుడైనందున వీరికి "సరస్వతీ కంఠహార"మను బిరుదముండెడిది. ఆయన తమ పెద్దలనాటి సంప్రదాయము నతిక్రమింపక శిల్పి కవి గాయక పండిత జనంబుల నాదరించాడు. ఆమహారాజాస్థానమున శంఖఫలకాసీన పదవినొందిన పండితులు పండ్రెండు మంది యున్నారు. వారిలో సత్కీరుండనువాడొక్కడు.

ఒకానొక సమయంబున వర్షములు లేక కాటకము సంభవించింది. భూములు పండక భుక్తిగడవక ప్రజలు వారివారి ఒనరుల ననుసరించి వలసలు పోవుచున్నారు. ప్రభువుగారి ప్రత్యేకాదరణ గలవారు మాత్రమా నగరమందే నిలిచియున్నారు. గ్రామ మందలి యొక బీద శైవ బ్రాహ్మణుండును కుటుంబసమేతంబుగ వలసపోవ ప్రయాణము మరునాటి ప్రొద్దుటకు నిర్ణయించుకున్నాడు. నాటిరేయి వాని స్వప్నమున సాక్షాత్కరించిన పరమేశ్వరుడు "విప్రోత్తమా! నేనొకపద్యం వ్రాసియిచ్చుచున్నాను. నీవు దానిని గొనిపోయి యీ నగరమేలుచున్న పాండ్యరాజేంద్రునకిమ్ము. రాజాదరణము లభించి నీ దరిద్రము తీరగల"దని చెప్పి యదృశ్యమయ్యాడు. బ్రాహ్మణుండు మేల్కాంచి తన మంచము మీద స్వప్నగీత పురుషుండు వ్రాసియిచ్చిన పద్యముగల పత్రముండుటను గాంచి పరమానంద భరితు డయ్యాడు.

మరునాడా శైవ బ్రాహ్మణునకు రాజదర్శనం లభించింది. వారు కొని వచ్చిన పద్యం చదువుటతో నిలుపులు మారినందున నేర్పడగల భావ

భేదంబులను క్రోడీకరించుచు సత్కారు డాక్షేపించాడు. దానికి బదులు చెప్ప గల పాండిత్యము లేని బ్రాహ్మణు డింటికి పోయి "దేవా! నాకింతటి యవ మాన మేల కల్పించితివయ్యా!" అని స్మరించినందున యిందుధరుండు ప్రసన్నుడై "అందు దోషము లేవియో నిరూపణ చేయు" మని నేనా పండి తునే యడిగెదను. నీవు నావెంట ర"మ్మని మాయా బ్రాహ్మణ రూపమున రాజసభామండపమునకు పోయాడు.

పండిత సభ వంక చూచిన కపట బ్రాహ్మణుండు "నాయీ పద్యం బును దూష్య మనిన వారెవరు? ఇది ఛందోబద్ధము కాదా? వ్యాకరణ లక్ష ణము లేదా! భావపూరితము కాకపోయినదా! ఆక్షేపణలు తెలిపినవారు సహే తుకముగ విమర్శింపు" డనుచు పదప్రయోగ చాతుర్యమును ప్రకటించుచు పద్యంబును చదివి సభాసదు లందరిచేతను "శెహబాష్" అని తలలాడింప చేశాడు. అంతటనైనను లౌకిక జ్ఞానము బొత్తుగ లేని సత్కారుడు యుక్తి యుక్తంబుగ దప్పుకొనక పోవుటయు గాక వితండవాదనకు పూను కున్నాడు. శివుడంతట నాగ్రహించి "ఓయీ! అలంకార శాస్త్రమును చదువుటమే పాండి త్యము కాదు. తోడి వారి విద్యయందలి మంచితనమును గ్రహించి సత్య మును వచించుట యుత్తమ విద్వాంసులకుఁ జెల్లు. దురహంకారమున సహ నములేని నీవు కుష్ఠు వ్యాధి పొందువుగాక" అని శపించాడు.

అంతటితో సత్కారుని తిక్క తిరిగి దారికి వచ్చింది. కుష్ఠువ్యాధి యని నంతనే భయభ్రాంతుడైన సత్కారుండు మాయా బ్రాహ్మణుని పాదంబు లంటి "అయ్యా! నేనెంత పండితుడ నైనను సమయానుకూల వర్తనంబు

నెఱుంగక శృంగభంగ మొందాను. సంభవించిన శాపము నెటులేనియు నను భవింపక తప్పదు. ఐన శాపవిముక్తి నాకు శీఘ్రకాలంబున కలుగునట్లను గ్రహింపు" మని వేడుకొనినందున పరమేశ్వరుండు "నీవు దక్షిణకైలాస యాత్రచేసి శ్రీకాళహస్తీశ్వరు నారాధించిన వెంటనే శాపవిముక్తి కాగల" దని వరమిచ్చాడు.

# సాయుజ్యమును పొందిన సత్కీరుడు

పెద్దల నెదిరించి ప్రమాదము పాలైన సత్కీరునకు జ్ఞానోదయ మయింది. కుష్ఠువ్యాధి సంక్రమించిన తరువాత నేనా దైవసన్నిధానమునకు పోగలనో, లేదో? అందులకై ముందుగనే తీర్థయాత్రలు సేయుట మంచిదని తలంచినందున జాగ్రతపడి పాండ్యరాజేంద్రునితో చెప్పి తన కుటుంబము నందలి వారికి యొప్పగింప వలసిన బాధ్యతల నొప్పగించిన తరువాత నొక శుభదినంబున ఇలువీడి శివపంచాక్షరీ మహా మంత్రమును జపించుచు కన పడిన శివక్షేత్రములందలి దేవతామూర్తుల నారాధించుచు, పుణ్యతీర్థములలో మునుంగుచు, తాపసోత్తములను పెద్దలను పూజించుచు, అందందు సంచరించి మార్గాయాసము నొంది నందున నొక నీటికొలనున సేద దీర్చుకుని ప్రక్క నున్న మఱ్ఱిచెట్టుక్రింద విశ్రమించాడు.

బడలిక గొన్న సత్కారునకు యొడ లెరుంగని నిద్ర పట్టింది.

ఆ అడవి యందు సంచరించు చున్న భూత మొకటి గాఢనిద్ర యం దున్న సత్కారుని గొనిపోయి తన గుహలో పడవైచి వెలుపలి తాళములు బిగించి మరల సంచారం పోయింది. మేల్కాంచి చూచిన వాని కేమియు బోధపడలేదు. ఆ గుహ చాల విశాలమైనది. అందింకను తనవంటి వారు తొంబది తొమ్మండుగు రున్నారు. వారందరు నొక యూరివారు కారు. ఒక జాతివారును కారు. తన మాదిరే ప్రయాణము సేయుచు భూతము చేత పట్టు బడి బరిధింపబడిన వారే. ఇపుడీ సత్కారుని తోడ నోర్గురగుటచే లెక్కపూర్తి యైనది. ఇక నాభూతము రెండు మూడు దినములలో వీరి నందరను కాళికా లయంలో దేవికి బలి యిచ్చి దాని వ్రతం పూర్తి చేసుకుంటుంది. ఈ విషయ మంతా మొదట పట్టుబడిన వానికి భూతము యొక్క పరివారంలోని వారి వలన తెలిసి నందున వానివలన నందరకు తెలిసి పోయింది.

తెలిసిమాత్రము వారుచేయగల దేదీ లేదు.

ఆ గుహనుండి తప్పించుకొను పోవుట కవకాశములు లేనందున బంధితులంతా రానున్న ప్రమాదమును గురించి చింతింపసాగారు. సత్కారుం డంతటవారిలో "అయ్యలారా! ఆపత్కాలమున చింతించి ప్రయోజనముండదు పురుష ప్రయత్నము నెన్నడును విడువరాదు. అనగ శత్రువు నెదిరించమని నాయభిప్రాయముకాదు. ఆపద్బాంధవుడైన భగవంతుని ధ్యానించుట కర్తవ్యము. పరమేశ్వరుని నమ్మినవారికి రక్షణకలుగకపోదు. ఒకప్పుడు మరణమే తప్పని సరి యైనయెడల కైవల్యమైనను సిద్ధింపగల"దని కర్తవ్యము

నెరించాడు. రక్కసుని వారును కొదనక నిశ్చల మనంబులతో సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని వేడుకున్నారు.

భక్తపరతుడైన పరమేశ్వరుడు కుమారస్వామి రూపంబున సాక్షాత్కరించి పెనుభూతమును చంపివేశాడు. గుహాతలుపులు బాహాటంగా తెరపించి "మీరందరు నింక నిరాటంకముగ మీమీ యిండ్లకుపొండి. మిమ్ము బంధించిన భూతము చనిపోయింది. మీకెవరి వలనా యెటువంటి భయము నుండ"దని చెప్పినంతనే గుహాయందున్న వారందరును షణ్ముఖునకు నమస్కారాలుచేసి. సత్కీరుని పుణ్యమా అంటూ యెవరెవరి స్థానాలకువారు చేరుకున్నారు.

అంతగుహుండు సత్కీరునితో "భక్తాగ్రణీ! నాడు పాండ్యరాజ కొలువులో పరమేశ్వరుడు నీకు నిర్దేశించిన ప్రదేశము పవిత్ర సువర్ణముఖీ తీరమందలి దక్షిణ కైలాసపర్వత మనంబడుచున్న శ్రీకాళహస్తీశ్వరక్షేత్రం. శీఘ్రకాలంబున నీవచటకు చేరగల యుపాయంబు జెప్పెద. నీవీ తామరలున్న కొలనులో మునుంగుము. నీ సంకల్పము ఫలింపగల"దనిన సత్కీరుండ ఆరుమొగముల స్వామికి అభివందన మాచరించి స్వామిచూపిన జలాశమున స్నానమొనరించి నంతనే వాని కుష్ఠవ్యాధి యంతయు మాయమై కాంతివంతమైన సుందరదేహము వచ్చింది. వానికి దక్షిణకైలాసమును గోచరించింది.

అంతకన్న సత్కీరునకు కావలసినది మాత్రమేమున్నది? వెనువెంటనే చనుదెంచి వాయులింగము నారాధించిన యనంతరమున జ్ఞానప్రసూ

నాంబా కాళహస్తీశ్వర సాక్షాత్కారం వానికి కలిగింది. సత్కీరుండు పొందిన యానందమునకు హద్దులు లేకపోయినై. పరమేశ్వరా! మహా పండితుండ నయ్యు దురహంకారమున ప్రవర్తించుటం జేసియేకద యీప్రతిఫలము ననుభవించాను. మహాదేవా! ప్రకృతి మాయామేయము. నేను మరల నీమాయలో బడకుండ శాశ్వతమైన సాయుజ్యమును ప్రసాదింపు"మని కోరినంత పరమేశ్వరుం డట్లేనని వరమిచ్చాడు.

ద్రావిడభాషా కవీంద్రుఁడైన సత్కీరుండా సమయంబున శ్రీకాళహస్తీశ్వరస్వామి నభినందించుచు ద్రవిడమునందు చెప్పిన నూరుపద్యము లీనాటికిని ప్రజావాడుక యందునిలిచి పోయినై.

# మాణిక్యవల్లి కుమార్తెల కథ

సత్కీరుని పేరుప్రతిష్ఠలు ప్రపంచము నందు నలుదిక్కుల ప్రాకింది. పాఠశాలలు లందును సత్కీరుని చరిత్రము పాఠ్యభాగముల కెక్కింది. సత్కీరుని గురించిన పురాణములు హరికథలుగూడ చాలమంది పుణ్యకాలక్షేపములుగ పరిణమించినై. ఇప్పుడా మధురాపురంలో సత్కీరుని పేరు విననివారు లేరు. ఆగ్రామమందలి సానివాడయు సుందరమైనది. సంగీత సాహిత్యముల కది పుట్టినిల్లు. అందచందాల కాటపట్టు సుఖసంతోషాలకునికిపట్టు. భక్తి శృంగారములకు పట్టుకొమ్మ.

చొక్కేశ్వరస్వామి మధురానగర క్షేత్రపాలకుడు. స్వాముల వారి దేవేరి పేరు మీనాక్షీదేవి. మీనాక్షీ చొక్కేశ్వరాలయమున కళావంతులకు రాజు లిచ్చిన మాన్యము లున్నవి. రతీదేవిని మించిన వన్నెచిన్నెలు గల యావెల కాంతులు చూడ చక్కదనాల చందనపు బొమ్మలు. వారి క్రీగంటి చూపు సోకిన నెంత విరాగియైనను సరాగి యగుట యందనుమాన ముండదు. మధురా పుర మందలి భోగపుస్త్రీ లెంత మదనవతులై కులవృత్తుల పాటించు చున్నను వారికా కామాక్షీచొక్కేశ్వర స్వాముల వారి యెడ నున్న భక్తి ప్రవత్తులంత యింత యనరానంత గొప్పదనక తప్పదు.

మధురాపురి సానివాడ లోని సానులందరిలోను మాణిక్యవల్లిదే అగ్ర స్థానం. స్వాముల వారికి వసతోత్సవాలు జరిగే సమయం. పరిసర గ్రామాల నుండే గాక తిరునాల పేరున దూరదేశ ప్రజలు గూడ తండోపతండాలు వచ్చే తరుణం. పడపు వృత్తి నవలంబించిన పడతులకది ప్రత్యేకాదాయములు లభించే లాభసాటి కాలం. తిరునాల వినోదాలలో పాల్గొన వచ్చిన వారి కా నగరం చాలలేదని పించుచున్నది. యాత్రార్థ మచ్చటకు వచ్చిన శివభక్తుం డొక నాడించుక విశ్రాంతికై మాణిక్యవల్లి యింటి యరుగు మీద కూర్చుండి నగరాలంకారం తిలకిస్తున్నాడు.

బంగారము వంటి మేనిఛాయ, విభూతి నలమిన మోము, కుండలాభర ణము లలంకరించిన చెవులు, విప్పారిన జన్నులు, నిడుపైన ముక్కు, రుద్రాక్షమాల లున్న మెడ గలిగిన బాటసారిని చూచినంతనే మాణిక్యవల్లి మనసు చలించింది. తనయింట పనిచేయు దాసీని పిలిచి "ఏమే! ఈ దినము

పడక కౌసించి మనయింటి కెవరు వచ్చినను—ఎంత ధన మిచ్చెదమని భ్రాంతి కొల్పినను నేటి కవకాశము లే" దని చెప్పి పంపివేయు" మని నియమించింది.

ఆమె స్వయముగ మేడదిగి పోయి అరుగుమీద కూర్చుండి యున్న పరదేశికి నమస్కరించి "స్వామీ! తమ రెవ్వరో దూరదేశపు బాటసారుల వలె నున్నారు. మీ రూపము చూచినంతనే శ్రోత్రియ బ్రాహ్మణులని తెలియుచున్నది. ఇవి పండగ దినములు కద! దయయుంచి నాప్రార్థన నిరాకరింపక మమ్ము పావనము సేయ నొక్కమారు మాగృహంబునకు విచ్చేసి శక్త్యనుసారముగ నేనొసంగు సన్మానంబుల నందుకొను" డని స్వాగతం చెప్పింది. సమ్మోహనా స్త్రముల కన్న పదునైన వేశ్య వచనంబులకు సంప్రీతినొందిన విప్రయువకుం "డట్లే" నని సాని వెంట మందిరములోనికి పోయాడు.

వెంట నంటి యింట జొచ్చిన శివభక్తు నుచితాసనంబున గూర్చుండ బెట్టి పాదపూజ లొనరించి సుగంధ ద్రవ్యాదుల నలమి వట్టివేళ్ళ విసన కఱ్ఱ చేబట్టి వీచుచు వలచిన వన్నెగానిని వశపరచుకున్న మాణిక్యవల్లి యారేయి యంతయు వానితో కామసుఖంబుల ననుభవించినదై మఱునాటి యుదయమున విప్రకుమారుని పన్నీటిస్నానము చేయించి నూతన వస్త్రముల నలంకరించి దక్షిణతాంబూలముల సమర్పించిన పిదప వీడ్కోలు చెప్పింది. శివభక్తుని సంయోగ ప్రభావంబున నమాణిక్యవల్లి గర్భవతియై యిరువురు కుమార్తెలకు తల్లయింది. మాణిక్యవల్లికన్న కవలపిల్లలా యింటికే గాక—ఆ వాడకు ఆ నగరానికి గూడ వెలుగు దెచ్చిన వారయ్యారు.

చక్కగ చదువుకుని సంస్కార పరులైన కుమార్తెలిద్దరకు తల్లి దేవదాసీ పట్టాల నిప్పించింది. వారి వయసులు చూచి—సొగసులు చూచి ధన వంతులైన రసికు లెందరో వారింటి చుట్టు తిరిగి పోవుచున్నారు. ఇంత జనా కర్షణ గల యిద్దరు కుమార్తెలకు కన్నెరికం పెట్టించుకుని రెండు చేతులా సంపాదించి కుప్పలు పోసుకోవాలని కలలు కంటూంది. కాని మాణిక్యవల్లి కుమార్తెల కట్టి తలంపులేదు. వారీ పడపువృత్తి యందు జీవించక శ్రీకాళ హస్తీశ్వరుని యందే మనసు లగ్న మొనరించి భక్తి గీతములు పాడుకుంటు న్నారు.

ఎంతసొమ్మిచ్చెద మన్నను లోబడని మాణిక్యవల్లి కుమార్తెలను మోసగించి యైనను వాంఛ దీర్చుకొన వలయునని తీర్మానించు కొనిన కుటి లాత్ములు కొందరు భక్తుల వలె నటించుచు "మేము శ్రీకాళహస్తీశ్వరుని దర్శింప దక్షిణకైలాసమునకు పోవు చుంటి" మని చెప్పటం జేసి వేశ్య కుమార్తెలు వారి మాటలు నమ్మి తల్లితోనైనను చెప్పకయే కపట భక్తుల వెంట తయలుదేరి కాళహస్తికి ప్రయాణం సాగించారు. కొంతదూరము పోయిన తరువాత వంచకులు ఏకాంత ప్రదేశమున దుండగులు తమ వెంట నున్న భక్తురాండ్రను వంచింప బోయారు.

మన మిపు డన్యాయంగ మోసగాండ్ర చేత పట్టుబడినామని గ్రహిం చిన యా కాంతలు మనంబుల పరమేశ్వరుని ధ్యానించి నంతనే శంకరునిచే నియమింప బడిన ప్రమథగణం లోని వారు యాత్రికుల వలె వారి యొద్దకు పోయి మానవతుల సంరక్షించారు. కళంకములేని భక్తి వైరాగ్యములు గల

ఆ అక్క చెల్లెండ్రడు కొలదిదినములలో దక్షిణకైలాసం చేరుకుని సువర్ణ ముఖిలో స్నానములు చేసి మారేడు దళములతో శివు నలంకరించి కర్పూర హారతి నిచ్చినంతనే సాక్షాత్కరించిన సాంబశివు డాభక్తురాండ్రకు సాయు జ్యము నిచ్చాడు. తనయందలి నమ్మకమున వంచకుల ననుసరించి వచ్చి చిక్కుల పాలైన దిక్కులేని యాడవారిని కాపాడి తన సన్నిధికి జేర్చుకొనిన శ్రీకాళహస్తీశ్వర స్వామి భక్తజన వాత్సల్యము కొనియాడ తగినది.

# నరసింగరాయ నరపాలుడు

మహాభారత కాలంనుండి మనదేశంలో యాదవరాజుల పరిపాలన జరు గుతునేవున్నది. ఆకాలాన చిత్తూరు మండలానికి చెందిన పుత్తూరునకు సమీ పము నందున్న నారాయణవనం ముఖ్యనగరంగ రాజ్యమేలిన యాదవ నర సింగరాయ నరపాలుడు శివభక్తుడు. అంతేగాక శివభక్తుల నాదరించిన శైవాభి మాని. రాజాంతఃపుర మందలి యొకదాసీయు శివభక్తురాలు. ప్రతిదినమామె తన సేవాధర్మం నెరవేర్చిన విశ్రాంతి సమయంలో నియమము తప్పక శివ పూజచేయడం శివనామసంకీర్తనలు పాడడం శివమహిమలు వర్ణించడం శివ మూర్తుల నారాధించడమూ జరుగుతున్నవి.

మహాదేవుడొకనాడు మాయజంగం దేవర రూపం ధరించి దాసీ యింటికి వేంచేశాడు. దాసి తనయింటికి వచ్చిన మహానీయుని భక్తి శ్రద్ధాభి

మానాలతో పూజించింది. "ప్రతిదినమిట్లే తమ దర్శనభాగ్యం ప్రసాదించండి" అని కోరింది. దాని కాయన సరేనన్నాడు. అన్నమాట ప్రకారంగ జంగందేవర దాసియింటికి రావడం—దాని భక్తివినయాలతో సేవించి పంపడమూ నిత్యకృత్యము లయ్యాయి. కాలక్రమేణ ఆమెకే యుపచర్యలు వలన రాజకొలువుకు నిర్ణీతకాలంలో వెళ్ళలేని పరిస్థితి గూడ కలుగుతూంది.

ఒకనాడామె సకాలంలో చేయవలసిన పనులు చేయలేదన్న నేరంమీద ప్రభువులామెకు తల బోడి చేయించారు. జరిగిన దానికామె చింతపడలేదు. మరునాటి యుదయాన మామూలు ప్రకారముగ యింటికి వచ్చిన జంగమయ్య జరిగిందంతా తెలుసుకుని ఆమెకానాడే కేశసమృద్ధి కలిగేలా వరమిచ్చాడు. దాసి కీనాడు కలిగిన కేశాలంకారం మరింతశోభ కలిగిస్తూంది. రాజుగారు చూచారు. ఆమెతలకట్టు నేడింత సుందరముగ కన్పట్టినందున కోపమొంది రాజసేవకులను పిలిపించి "మీరీ దాదికి కేశఖండనం బొనరింపక నాయాజ్ఞ మీరినారేం? అని గర్జించాడు. సేవకులు గడగడలాడుతూ "ప్రభూ! దేవరవారి యానతిని మేము వెంటనే అమలు పరిచాం. మరి యీనాటి యీ విపరీత చిత్ర మేమిటో మాకు తెలియదు. మన్నించండి" అన్నారు.

రాజుగారంతట దాసీని పిలిచి "ఈ రాజసేవకులు చెప్పింది నిజమేనా!" అన్నాడు. దాసి కూడ ప్రభువుగారికి కేలుమోడ్చి "ఏలినవారి యాజ్ఞాను సారంగ నిన్న నాతల బోడి చేయబడింది. ఐతే ప్రతిదినం మాయింటికి వచ్చి నాపూజ లందుకుంటున్న జంగందేవర వారి యాశీర్వచనం వలన పోయిన జుట్టు పూర్తిగ వచ్చిం" దంటూ సమాధానం చెప్పింది. ఆ మాటలు

నమ్మలేని నరనాథుడు "నీవు చెప్పింది నిజమైతే నాకా మహానుభావుని దర్శనం చేయిస్తావా!" అన్నాడు. దాసి వినయంతో "ప్రభూ! భక్తులకు పరమాప్తుడైన పరమేశ్వరుడు మీకు మాత్ర మెందులకు దర్శన మీయడు? రేపటి యుదయం తమరు మాయింటకి దయచేయండి. స్వామితో స్వయంగా మాటలాడవచ్చు" నన్నది. రాజు సరే నన్నాడు.

మరునాటి యుదయాన మహారాజు వారు తాను చనుచున్న దొక దాసీ యింటి కను తేలిక భావము లేకుండ మహాదేవుని దర్శనమున కను భక్తి భావంబున పాదచారియై దాది యింటికి పోయాడు. అప్పటికే విచ్చేసియున్న శంకరు డాయనకు కనపడ్డాడు. వెనువెంటనే స్వామి పాదాల మీద వ్రాలిన నరసింగరాజు "దేవా! నావలస నేదేని యొక సేవ చేయించు కొని నన్నను గ్రహింపు" మని ప్రాధేయ పడ్డాడు. కరుణామయుడైన కాత్యాయనీ వల్లభుండు చెప్పిన చందంబున సువర్ణముఖీనదీ తీరాన వేంచేసియున్న స్వామికి దేవాలయం నిర్మించాడు. దాసీ కూడ రాజనుమతిని పొంది భక్తాదుల ద్రవ్య సాహాయంతో వాయులింగాలయాని కెదురుగ గాలిగోపురం కట్టించింది.

చందా లడిగి కట్టించింది కనుక యీ చిన్ని గాలి గోపురానికి బిచ్చాల గోపురమనే పేరు యీనాటికిని నిలిచి పోయింది.

యాదవ నరసింగరాయ నరపాలు డానాడు కట్టించిన శ్రీకాళహస్తీశ్వరాలయానికి చోళ పాండ్యులు, విజయనగర రాజులు మరి కొన్ని నిర్మాణములు చేశారు. శ్రీకృష్ణదేవరాయలవారు మండపము ప్రాకారము పెద్దగాలి గోపురము నిర్మించారు. అటు తరువాత కాళహస్తిని పాలించిన దామెర్లవంశ

భూవరులు కేవలము శివభక్తి తత్పరులై శ్రీకాళహస్తీశ్వర స్వామియే కాళహస్తి నగరమునకు గూడ సర్వాధికార సార్వభౌము లంటూ పట్టాభిషేకం గావించి మేము స్వాములవారి సామంత పాలకుల మని చెప్పుకున్నారు. శ్రీ కాళహస్తీశ్వర చరిత్రలను రచించిన కవులెందరనో దామెర్ల వంశపు రాజు లాదరించారు.

# దామెర్ల రాజుల దాన ధర్మములు

శ్రీకాళహస్తిని పాలించిన వారిలో దామెర్ల రాజులు సుప్రసిద్ధులు. దామెర్ల తిమ్మనాయనిం భూపాలుడు కైలాసపతినే గాక ప్రసన్న వరదరాజ స్వామిని కూడ సేవించాడు. ఆ కాలాన చంద్రగిరిని పాలించుచున్న వీర వేంకటపతిని దేవరాయలు మరణింపగ వారికుమారుడు శ్రీరంగరాయ భూపతులు సింహాసన మెక్కారు. ఆయనకు జగ్గరాజుతో పోరాటం సంభవించింది. రంగరాయలవారి కోరికమీద వారికా యుద్ధంలో తిమ్మనాయనింగారు తోడ్పడుట జరిగింది.

రంగరాయలు పక్షమున జగ్గరాజు నెదిరింప పయనమైన తిమ్మనాయనింగారు రథగజతురగ పదాతుల ముందు నడవ నియమించిన తరువాత స్తిమితముగ పట్టపేనుగు నెక్కి చనుచున్న మార్గ మధ్యమున నొక గాజుల

శెట్టి కనపడి వందనము లాచరించి "ప్రభూ! పండుముత్తయిదువగ నున్న మీయమ్మగారు చేతులకు గాజులు తొడిగించుకుని యీదారినే మాయబ్బాయి తిమ్మరాజు వచ్చుచున్నాడు. వాని నడిగి యీ డబ్బులు పుచ్చుకొమ్మని చెప్పినారని వూరుకున్నాడు. ఆ మాటలు విన్న రాజేంద్రుని కేమియు బోధ పడక తరువాత చూతమను తలంపుతో "నేనిపుడు యుద్ధమునకు పోవు చున్నాను. తిరిగి వచ్చాక కనపడు" మని చెప్పి ముందుకు సాగాడు.

ఆనాటిరేయి నిద్రించుచున్న తిమ్మభూపాలుని స్వప్నమున కనపడిన పెద్దముత్తయిదువ "గాజులు తొడిగిన శెట్టికి డబ్బులీయలేదు నాయనా!" అని నందున ప్రభువులవారి కామాట చెప్పినది. మాతాజ్ఞాన ప్రసూనాంబయేయను నమ్మక మేర్పడింది. ఇంటికి వచ్చిన మరునాడే రాజసభలో యీవిషయమును వెల్లడించిన తరువాత శెట్టిని రావించి వానికి పెళ్ళూరని గ్రామ మగ్రహారంగా యిచ్చాడు. నేటికి నాగ్రామము గాజుల పెళ్ళూరనియే పిలువంబడు చున్నది. మహామహిమా సంపన్నురాలైన జ్ఞానప్రసూనాంబాదేవి రాజుదారి స్వప్నము నందు కనపడిన కధ నేనాటికిని అక్కడివారు చెప్పుకొనుచునే యున్నారు.

# నలువైపుల నున్న నాలుగు ద్వారములు

దక్షిణకైలాస మందలి ప్రధానాలయము శ్రీకాళహస్తీశ్వరాలయము. దీనికి నలువైపుల నాలుగు పెద్ద ద్వారము లున్నవి. వానిలో మొదటిది

తూర్పు ద్వారము. తూర్పు ద్వారమునకు లోపలావరణలో కుడిప్రక్కన బాలజ్ఞానాంబికా కోవెల యున్నది. ఈ గుడినుండి పాతాళ విఘ్నేశ్వరాలయమునకు మధ్యనున్న ప్రదేశమందలి శివలింగములు పూర్వకాలపు రాజులచే నెలకొల్పబడినవి. భక్తులు, యాత్రికులు ముందీ బాలజ్ఞానాంబను దర్శించి పూజించెదరు.

పాతాళ విఘ్నేశ్వరాలయమునకు సమీపము నందే గుఱ్ఱపుసాని మండపమున్నది. గుఱ్ఱపుసాని మండపమునకు నైరుతిగ రెండుకాళ్ళ మండపమున్నది. యాత్రికులు దీనిని గమనింతురు. జ్ఞానప్రసూనాంబా కాళహస్తీశ్వరులు యుత్సవములకు బయలుదేరినపుడు ఉత్తరద్వారము నుండి పట్టణము లోనికి ప్రవేశించి పెద్దగాలిగోపురము నుండి వీధిలోనికి పోయెదరు.

ఆలయము యొక్క పశ్చిమ ద్వారము నందుండి చూచినవారికి సువర్ణముఖీనది కనపడుతూంది. ఈద్వారమునకు లోపలి భాగాముస స్వాములవారి పూలమాలలు గట్టు పనివారలకై కేటాయింప బడిన గదులున్నవి. పశ్చిమ ద్వారము యొక్క క్రింది భాగమున ఉత్తరపు భాగమున నొకచిన్న విఘ్నేశ్వరాలయ మున్నది. సువర్ణముఖీ నదీప్రవాహము నిండుగా వచ్చినపుడీ చిన్న విఘ్నేశ్వరాలయము నీటమునుగుతూంటుంది. అపుడీ నదిని "నిండేరు నిండుమొగలేరు"అని యందురు. ఆసమయంబున ముత్తయిదువలు నదీమ తల్లికి పసుపు కుంకుమములతో పూజించి కర్పూరహారతు లిచ్చెదరు. నదీ ప్రవాహమెంత తీవ్రరూపము దాల్చినను కాళహస్తీశ్వరాలయము చెంత మాత్రమలికిడి యుండదు. దానికోకథ చెప్పబడుతూంది.

నది యుదయించిన దాది ప్రవాహ మధిక మైనపుడు రణగణ ధ్వని చేయుచుండెడిదట. అధ్వనిని సహింపలేని పార్వతి పరమేశ్వరునితో "స్వామీ! ఈనదీ ప్రవాహధ్వనికి నాకుతలనొప్పి వేయుచున్న"దని నందున శంకరుడు గంగనాజ్ఞాపించుటం జేసి అప్పటినుండి నది యెంతవేగముగ ప్రవహించినను దుర్గాంబతిప్ప దాటువరకు నెట్టి యలికిడియు చేయుటలే"దని చెప్పుచున్నారు.

పశ్చిమ ద్వారమునకు దక్షిణముగ నున్న పెద్దమండపము విజయనగ రాధీశ్వర శ్రీకృష్ణదేవరాయల వారి నిర్మాణము. పెద్దమండపమునకు ఉత్తర మున చిన్నమండపము—తూర్పున పొగడమాను. ఆపొగడమానుకు దక్షిణ ముగ వసంత మండపము. వసంత మండపమునకు నైరుతిగ పెద్ద వంటశా లలు భోజనశాలలు నున్నవి. రాజులు సంపూర్ణాదరాభిమానములు లభించిన నాటికాలాన బ్రహ్మోత్సవాదులు జరుగునపుడాశాలలో సంతర్పణలు గొప్పగా జరిగినవని వినికిడి. భోజన శాలలకు సమీపమున దక్షిణ ద్వారము.

దక్షిణద్వారము నుండి కన్నప్పకొండకే కాకుండ మణికంఠేశ్వరాల యము, పంచముఖేశ్వరాలయము, బ్రహ్మ తీర్థములకు గూడ మార్గము లున్నవి. దక్షిణ ద్వారము చెంతనున్న ధర్మసత్రము శ్రీతిరుమల తిరుపతి దేవస్థానము వారును, శ్రీకాళహస్తీశ్వర దేవస్థానము వారును నిర్మించి యున్నారు. ఈసత్రము నందు యాత్రికులకు కావలయు వసతులు లభించు చున్నవి. అచటకు తూర్పుగ నున్న దక్షిణకైలాస గిరులమీదనే కన్నప్ప గుడి వెలసినది.

స్వామి వాయులింగ మనుటకు తార్కాణముగ లింగమున కుడివైపున నున్న రెండు ఖండ జ్యోతులు గాలియున్నటులనే రెపరెపలాడు చుండుటయు మహా శ్చర్య కరము.

పూర్వమొకప్పు డిందున్న పూజారి స్వామి కభిషేకము సేయుచుండ పొరపాటున స్వామికి తగిలిన చిటికెన వ్రేలంతవరకు బంగార మైనదట. ఆ కారణమున నేటికిని కాళహస్తీశ్వరస్వామి నంటకయే అభిషేకము సేయు టాచార మైనది. స్వామి కభిముఖముగ నున్న బంగారు కవచమున కలంకా రాది పూజలు జరుగుచున్నవి.

ఇందున్న నందీశ్వరుడు స్వయంభూ యంటారు. ఈయనకును నిత్య నైవేద్యాది పూజలు జరుగుచున్నవి.

ఈ ఆలయము నుండి తిరిగి ధ్వజస్తంభమును జేరి పడమరగా పోయి అచట నుండి ఉత్తరాభిముఖముగ చనుదెంచిన భక్తకన్నప్ప విగ్రహం కన పడుతుంది. శమీపమునందై పంచలింగములు వేంకటేశ్వరస్వామి లక్ష్మీగణ పతి శక్తిగణపతులు శనిదేవ మందిరము లున్నవి. వాని కావల తూర్పు దిక్కున నున్న మూడు మెట్లుదిగి అచటికి ఉత్తరముగ నున్న నటరాజ మూర్తి కల్పవృక్షములను చూచిన తరువాత తూర్పుకు పయనించి కాలభైర వుని, బట్టలభైరవులను గాంచి తూర్పునందున్న యజ్ఞశాలల నుండి పడమర వైపు చూచిన జ్ఞానప్రసూనాంబికా దేవిని దర్శింప వచ్చును. జగన్మాత తూర్పు ముఖమున నున్నది. దేవి గర్భాలయమునందు చిత్రలేఖనములు, ఆదిశంకరాచార్యుల వారిచే ప్రతిష్ఠ చేయబడిన శ్రీచక్రము లున్నవి.

జ్ఞానప్రసూనాంబా దేవికి పర్వదినములందును. శుక్రవారము లందును బంగారు చీరెగట్టి దివ్యాలంకారములు సేయుదురు, వశిష్ఠ మహాముని తన సంతానమును కోల్పోయినపుడు శివసాక్షాత్కారము పొందిన తరువాత నీ దేవిని జ్ఞానప్రసూనాంబ యను పేరు కలిగినదనియు వినుచున్నాము. ఆతల్లి చిరునవ్వుల వదనారవిందము భక్తుల కానందము తృప్తి భక్తిముక్తుల కలిగించు చున్నది.

అమ్మవారి దేవాలయము నుండి వెలుపలకు వచ్చినంతనే అద్దాల మేడ కనబడుతూంది. లోపల నున్న వన్నియు నిలువుటద్దాలు. ఆగదిలో అద్దంలేని చోటంటూ కనపడదు. అది స్వాముల వారి శయన మందిరం. ఇందు సుందరములైన ఊయేలలయిట్లు నమర్చబడి యున్నవి. సంతానాభిలాషులా పడకటింటిని దైవప్రార్థనలు చేయు చుందురు.

అద్దాలమేడ కావలగనున్నవి సింహవాహనములు. వానికించుక దక్షిణముగ పైభాగము నందున్న శివలింగములు యముని చేతను చిత్రగుప్తుని చేతను ప్రతిష్ఠలు చేయబడినవని తెలియుచున్నది. దేవతలీనాటికిని ప్రజల కంటికి కనపడకుండగ వచ్చి యీలింగములను సేవించి పోవుచున్నారన్న దొక ప్రజావాడుక, ఆప్రక్కనున్న చిన్నికోవెలలోని చండికేశ్వరస్వామి యీ క్షేత్రమును దర్శింప వచ్చిన వారినందరను గురించియు వ్రాయుచుండే నని యిచటి వారి నమ్మకం.

జ్ఞానప్రసూనాంబా క్షేత్రమునుండి తూర్పుగ నడచి యించుక క్రింది భాగమునకు దిగిన ప్రాకారము శివలింగములు కనబడును. దక్షిణముగ స్ఫటి

కలింగము నందెల్లప్పుడును జ్యోతి ప్రకాశించుచున్నది. వానికి దక్షిణముగా మిద్దె ఆచటకు సమీపము నందే సింహద్వారమును చేరవచ్చును.

# బ్రహ్మతీర్థము - సరస్వతీ తీర్థము

ప్రధానాలయాది ప్రదేశంబుల తిరిగిచూచి యానందించిన యాత్రికు లిచటి ధ్వజస్థంభము చెంత నొక్కించుక తడవు ప్రాలుమాలిక దీర్ఘకాలన కూర్చుండుడిచటి సంప్రదాయము సమీపము నందున్న పొగడమాను క్రింద ప్రతిసంవత్సరమును వసంతఋతువులో మహోత్సవములు జరుగుచున్నవి. దక్షిణ ద్వారము చెంతనున్న సత్రములకు సమీపము నందే దేవస్థానమువారు పుస్తకభాండాగారము ప్రదర్శన శాలలు నిర్మించారు.

ఆచటనున్న మణికంఠేశ్వరాలయము పురాతనము. ప్రాకారపు గోడ మీద నమర్చిన పలకరాలమీద సంస్కృత శ్లోకములలో శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము వ్రాయబడింది. కంచికోటి పీఠాధిపతులైన శ్రీచంద్రశేఖర యతీంద్రుల వారు పనిగట్టుకుని యీపని చేయించి నట్లు తెలియు చున్నది. మణికంఠేశ్వరాలయమునందు బావి యున్నది. లోతు తక్కువైనను నీరింకి పోదు. ఎంత నీరు తోడినను కొదువలేని నీరూరుచునే యుంటుంది. ఆ నీరు నిర్మలముగను-రుచికరముగ నున్నది.

అందుండి యించుక దక్షిణముగ నడచి తూర్పునకు చూచిన క్రింది భాగము నందు రంగమండపం కనుపిస్తుంది. పంచముఖేశ్వరాలయ మీరంగ మండపమునకు యెత్తున నున్నది. రంగమండపము నందున్న జీవకళ తాండ వించుచున్న శిల్పములు శివలీలలను చెప్పక చెప్పుచున్నవి. దాని కెదురుగ నున్న చిన్న బావినే బ్రహ్మతీర్థ మందురు. ఆదికాలాన పార్వతీ పరమేశ్వ రులు ఉత్తర కైలాసమునుండి యీ దక్షిణకైలాసమునకు వచ్చినపుడు బ్రహ్మదేవు డందలి కొండలను కొన్నింటిని యిక్కడకు గొనివచ్చి యీ పర్వతము చుట్టు నిల్పెనట. అపుడు ఋషులంతా చతురాననుని కొనియాడారు. తన్నభినందించిన మునులకై బ్రహ్మ యీకొలను నిర్మించినందున దీనిని బ్రహ్మతీర్థ మన్నారు-బ్రహ్మతీర్థము నకు ఉత్తరముగ నున్నదే సరస్వతీ తీర్థము.

శ్రీకాళహస్తీశ్వర క్షేత్రము శుభప్రదమైనది-పవిత్రమైన దనియు పెద్దల వలన వినుచున్నాము. ఇచట వేంచేసియున్న దేవతలందరూ మహా మహిమా సంపన్నులు. తీర్థములు చాల ప్రభావం కలవి. క్షేత్రాదులకు పూర్వ గ్రంధాధార చరిత్ర లున్నవి. కాళహస్తిని గురించి మన భారతీ యులే గాక యితర దేశము లందును కీర్తించు చున్నారు. ఈ దక్షిణ కైలాసా చలము ఐదు యోజనముల వెడల్పు. పది యోజనముల పొడవున నేబది యోజనముల వైశాల్యము కలదని పురాణములు తెలుపుచున్నవి. ఇదంతయు నొకే కొండ కాకుండగ మూడు నాలుగు వరుసలుగ రూపొందిన సువిశాల శివ

క్షేత్రం. దీని చుట్టుకొలత యించుమించుగ నిరువదైదు కిలోమీటరు లుండునని అంచనా కట్టబడింది.

# సూర్య పుష్కరిణీ ప్రభావము

పూర్వమొకప్పుడు కైలాసమున శంకరుడు కొలువుదీరి యుండగ ప్రమధగణంబులు నిండియున్నారు. అదే సమయంలో అక్కడకు వచ్చిన దక్షప్రజాపతిని చూచి సభలోని వారంతా లేచి గౌరవించారు. కాని, శివుడు మాత్రం లేవలేదు. దక్షుడు శివునకు పిల్లనిచ్చిన మామగా రయినా శక్తి సామర్థ్యాలలో చాలనివాడైనందున ఆ సమయంలో తాను లేవరాదని శంకరుడు చూచియు చూడ నట్లూరుకున్నాడు. దక్షున కది కోపకారణ మయింది. ఎవరెన్ని చెప్పినా వినిపించుకొనకుండ తిరిగి పోయాడు.

ఇంటికి పోయిన దక్షునికి శివుని పరాభవించి తీరాలనే దుర్బుద్ధి పుట్టింది. ఒక మహా యజ్ఞం చేయడానికి తలపెట్టి పెద్దపెద్దవారి నందరనూ పిలిచాడు కాని పార్వతీ పరమేశ్వరులను మాత్రం పిలువనంటె పిలువ నని పంతంబట్టాడు. ఆ సంగతి యెలుసుకునిన విష్ణుదేవుడు కాని, బ్రహ్మదేవుడు కాని, దేవేంద్రాదులు కాని దక్షయజ్ఞానికి పోకుండ మానుకున్నారు. మిగిలిన వారిలో చాల మందికీ సంగతి అక్కడకు పోయాక తెలిసింది. అప్పుడు దక్షు నెదిరించి తిరిగి పోయే ధైర్యం యెవరికీ లేకపోయింది.

దక్షుడు యజ్ఞం చేస్తున్నాడని మహేశ్వరికి తెలిసింది. ఆమె తన పెని మిటి యనుమతి పొంది తండ్రి యజ్ఞం చూడబోయింది. అంతటనైనను బుద్ధి లేని దక్షుడింటికి వచ్చిన యాడబిడ్డను పలకరింపక పోగా—నిందించాడు. శివ దూష వినలేని పార్వతి యోగాగ్నిలో దహనమై పోయింది. ప్రమథుల వలన భార్య పొందిన స్థితి నాలకించిన రుద్రమూర్తి వీరభద్రుని సృజించాడు. వీర భద్రుడు మహోగ్రావేశంతో భద్రకాళి మొదలైన వారిని వెంటబెట్టుకపోయి దక్షయజ్ఞం ధ్వంసం చేశాడు. సూర్యుని పళ్ళూడ దన్నాడు. అంతటితో పూష డనబడే యా సూర్యుడు బ్రహ్మదగ్గరకు పోయి మొరబెట్టుకున్నాడు.

సూర్యుని చూచి జాలిపడిన బ్రహ్మ "ఓయీ! జరిగిన దేదో జరిగిపో యింది. నీవు దక్షిణ కైలాసమునకుపోయి ప్రభాసతీర్థమున స్నానమొన రించి వాయులింగము నారాధింపు"మని చెప్పినందున సూర్యుడటులనే కాళహ స్తీశ్వరుని సేవించుచుండ కొన్ని దినంబులకు పరమేశ్వరుడు దర్శనమిచ్చి "నీవు శివదూషణ నాలకించుచు దక్షయజ్ఞశాల యందున్న కారణమున నీవీ శిక్ష ననుభవించితివి నీయపరాధమును నీవు తెలిసికొని నన్ను గురించి చేసిన తపసుక కానందించాను. నీమనంబున నీవు మునింగిన యీ ప్రభాసతీర్థ మిక మీదట సూర్య పుష్కరిణి యని పిలువంబడనున్నది. ఇందలి జలంబులచే నన్నభిషేకించి సేవించిన వారికి నేను ప్రసన్నుడనై యిహపరంబుల నిచ్చెద"నని చెప్పి యదృశ్యమయ్యాడు.

# చంద్రతీర్థ ప్రభావము

దక్షప్రజాపతి భార్య ధరణీదేవి. ఆ దంపతులకు నూరుమంది స్త్రీసంతానం కలిగింది. వారందరిలో పెద్దకుమార్తె సతీదేవి. సతీదేవి శంకరుల వారి పట్టపుదేవి. మిగిలిన దక్షపుత్రికలలో పదమువ్వురు కశ్యపబ్రహ్మకు భార్యలయ్యారు. వారివలననే యీ దైత్యదేవగరుడ ఉరగాది వర్గము లుదయించినవి దక్షబ్రహ్మ తన కుమార్తెలలో యిరువదియేడ్గురను చంద్రున కిచ్చి వివాహాలు చేయించాడు. ఆ చంద్రుని భార్యలే యీ అశ్విని భరణి కృత్తిక రోహిణి యనబడే నక్షత్రాలు.

చంద్రుడు తన భార్యలలో అందరి కన్న చిన్నదైన రోహిణి యందనురాగము గలవాడై తక్కిన వారల వంక కన్నెత్తి యైనను చూచుటలేదు. దక్షుడసలే ముక్కోపి. వెనుక ముందు లాలోచింపని పరమ మూర్ఖుడు. చంద్రుని చూచి "నీవు నీ భార్యల నందరను సమముగ గౌరవింపక పోయిన కారణమున నీకు క్షయవాధి కలుగుగాక" అని శపించాడు.

దక్ష శాపంతో చంద్రునకు భయంకరమైన క్షయవ్యాధి సంభవించింది. కళాహీనుడైన చంద్రుడు రోగనివారణకై బయలుదేరి కనపడిన నదులలో మునుకు విడుచు. తటస్థమైన క్షేత్రముల దర్శించుచు, ఎదురైన మహనీయుల పూజించుచు పోయి పోయి అగస్త్య మున్యాశ్రమం చేరుకున్నాడు. అగస్త్య

ముని చంద్రుని చూచి పరామర్శలు చేసిన తరువాత వానికి కల్గిన దుస్థితిని తెలిసికొని "వత్సా! ఇచటకు డెబ్బదిరెండు యోజనముల దూరమున దక్షిణ కైలాస మున్నది. అందలి వాయులింగము ప్రభావం గలది. నీవచటకు పోయి నదీజలంబుల స్నానముల జేయుచు శివు నారాధింపుము. పరమేశ్వ రానుగ్రహమున నీకు మేలు జరుగుతుం" దన్నాడు. చంద్రుడును భక్తి విశ్వాసంబుల శివపంచాక్షరీ మంత్రోపాసన చేయుచు కైలాసా చలం చేరి వాయులింగము నారాధించుచున్నాడు.

రోహిణీ వల్లభుని మీద దయ కల్గిన వామదేవుండు చైత్రశుద్ధ తదియా సోమవారం భరణీ నక్షత్రం కూడి యున్నప్పుడు శశాంకునకు సాక్షాత్కరించి "ఓరాజా! నీవు చేసిన పూజాదులకు నేనానందించాను. నీకు సంక్రమించిన యీ కుష్టువ్యాధి కొన్ని దినములు వృద్ధిపొందినను మరికొన్ని దినములు క్షీణించి పోయి నీవు రాణించు చుందువు. నెల కొక్క దినము సం పూర్ణ కళలతో ప్రకాశించు చుందువు. పురాణములందు దేవతలందు ముసు లందు మానవులందును నీవింతకు పూర్వము కంటె మించిన గౌరవ పూజల నందుకొనగలవు. నీవు స్నానమాచరించిన యీ జలాశయ మికమీద నీ పేరున చెప్పబడ నున్నది. మరియు నిన్ను నేనెప్పుడు నాతల నుంచుంచు కుంటాను. నన్నిక నీలోకంబులు చంద్రకిరీటధారి యని వర్ణింప నున్న"దని వరము లిచ్చిన తరువాత వాయులింగము నందైక్య మయ్యాడు.

# ఇంద్ర తీర్థ ప్రభావము

దేవతలకు గురువు బృహస్పతి. ఒకప్పుడా యింద్ర సభలో ర
దేవవేశ్య లతి మనోహరంగ నృత్య ప్రదర్శనం చేస్తున్నాడు. అది చ
స్వర్గలోకేశ్వరు డానంద పరవశంలో మైమరచి పోయాడు. అదే సమం
వచ్చి నిలుచున్న బృహస్పతుల వారిని పరాదీన చిత్తము నందున్న
ద్రుడు తన్ను గౌరవింపరాదన్న రోషావేశమున సభవీడి పోయాడు
పోయిన గురుదేవు డెక్కడికి పోయింది యెవరికీ తెలియలేదు.

బృహస్పతి దేవతలకు గురువేకాకుండ పురోహితాచార్యులు
ఆయన లేకుండ వారి కేపని జరుగదు. అందుకని దేవేంద్రు డాలో
దేవతలను మునులను వెంటబెట్టుకుని త్వష్టబ్రహ్మ కుమారుడైన విశ్వ
చార్యుల వారి యొద్దకు పోయి, వారికి జరిగిన యిబ్బందు లన్నింటిని
మీకు గురువులుగ–పురోహితులు నుండదగిన వారు మీరే" నని ప్రా
శిల్పి కుమారుని స్వర్గలోకం తీసుకుని పోయి పూజించారు.

దేవేంద్రు డొకప్పుడు యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞానికి విశ్వ
చార్యుడే ప్రధాన యాజమాన్యం వహించాడు. యజ్ఞానంతరం యజ్ఞఫలం
దేవతలందరకూ పంచాడు. దేవతలకు రాక్షసులు కేవలం సోదరులే అ

వారిలో వారికి గిట్టదు. బాంధవ్యాన్ని మించిన బద్ధవైర మైనందున హలిస్సులు రాక్షసుల కందేవికావు. కాని విశ్వరూపాచారికి దానవులు కూడ దగ్గర చుట్టమైనందున వారికి యజ్ఞపాయస ప్రసాదం రాత్రికాలంలో యిచ్చాడు. అది దేవతల కాగ్రహాన్ని కలిగించింది. మాకు గిట్టని పని చేశావు కనుక నీ గురుత్వం మాకిక నక్కర లేదు వెళ్ళిపో" అన్నారు. దేవపౌరోహిత్యం లేకపోతే తనకు వాచ్చిన లోపమేమీ లేదు కనుక త్వష్టకుమారుడు తిరిగి పోయి తపసు చేసుకుంటున్నాడు.

ఆచార్యుల వారు తపోదీక్ష వహించిన వార్త యింద్రున కందింది. విశ్వరూపుడు తన మీద పగచేతనే యింద్రపదవి కోరి తపమాచరించుచున్నాడనే అపోహపడ్డాడు. వెంటనేపోయి తన వజ్రాయుధంతో విశ్వరూపుని నరికి వేశాడు. కుమారుడు చనిపోయిన వార్తవిని త్వష్టబ్రహ్మ తారకాసురుని సృజించి, వానికెనలేని బలపరాక్రమంబుల నిచ్చి దేవేంద్రుని యంతు చూచి రమ్మని చెప్పి పంపించాడు. శిల్పి బ్రాహ్మని కుమారుని చంపిన దేవేంద్రునకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంది. తారకాసురుని ధాటి కోడిపోయిన పురందరుని బాధలు చెప్పితే తీరేవి కాకపోయినై. కుడిచి కూర్చుండక చేతులార చేటుతెచ్చుకున్న శచీపతి సత్యలోకానికిపోయి బ్రహ్మతో తన గోడంతా చెప్పుకున్నాడు.

చతురాననుండాలోచించి "పాకశాసనా! చేయరాని పనులు చేసి పొందరాని ఫలితం పొందావు. నీవు తిరిగి బాగుపడా లంటే ఒకటే మార్గం. కాళ

హస్తీశ్వరుడే నిన్ను కరుణింప దగిన దైవం. నీవా మహాదేవు నారాధింపు" మని చెప్పాడు. వెనువెంటనే దక్షిణకైలాస మేతెంచిన దేవేంద్రుడు నొక జలాశయమును నిర్మించుకొని భక్తిశ్రద్ధల తోడ, విధివిధానంబుగ శివార్చనలు సేయుచుండ కొంతకాలమునకు శంకరుం డాయనకు ప్రత్యక్షమై "సురాధిపా! నీవు కావలసిన వర మేదియో కోరుకొనుము–యిచ్చెద" నన్నాడు.

శంకర సాక్షాత్కారంతో పరమానంద మొందిన పురందరుండు పరమేశ్వరునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించిన తరువాత "చంద్రకళాధరా! నాకు సంభవించిన యీ బ్రహ్మహత్యా పాతకమునుండి నన్ను—తారకాసురుని బాధల నుండి నావారందరను గూడ తొలగించి కాపాడు"మని ప్రార్థించాడు. గౌరీరమణుండును ముదమొంది "దేవేంద్రా! నీవడిగిన వరముల నిచ్చితిని. భయపడకుము. నీవు పూజించిన యీ విశ్వేశ్వరలింగ మికమీద నింద్రేశ్వరుండనియు, నీచే నేర్పరుపబడిన యీ కొలను యింద్రతీర్థమనియు ప్రఖ్యాతి నొందనున్నవి. ఇంద్రతీర్థమున శుచులై నన్నారాధించిన వారి జన్మజన్మాంతర పాపంబులన్నియు హరించి వారికి శివసాయుజ్యము చెందుట కెట్టి సందేహమును లే" దని వరమొసంగి యదృశ్య మయ్యాడు.

# మణికేశ్వర తీర్థ ప్రభావము

పూర్వం కేకయదేశంలో కళానిధి యనే మహా పండితుడున్నాడు. ఆయన గొప్ప విద్వాంసుడే కాని చేయని పాపమంటూ యుండదు. ఆ కళానిధి మరణానంతరం తిరిగి గౌళదేశమందలి యొక విప్రుని కుమార్తెగ జన్మించాడు. పూర్వజన్మ సంబంధమైన విద్యాసంస్కార మున్నందున నామె కన్నివిద్యలూ పట్టుబడినై. ఆమెకు యుక్త ప్రాయం రాగ వివాహం కావడం, నెల తిరగక ముందే వైధవ్యము సిద్ధించటము గూడ జరిగినై.

తాడుతెగిన ముండ తండ్రిమాటయు వినకుండ దేశదేశాలూ తిరుగ సాగింది. ఒకప్పుడామె మిథిలాపురం పోయి రాజదర్శనం చేసుకుంది. జనక మహారాజామెకు తత్త్వోపదేశం చేసి, యికనైన మంచిదారిన నడచుకొ" మ్మని చెప్పి పంపాడు. మదాంధురాలైన ఆ విప్రాంగన మరల దేశ సంచారం సాగించి కౌండిన్యుని యాశ్రమం చేరుకుంది. నిష్ఠయందున్న మునిని నాతో పండిత వాదం చేయర"మ్మని గొడవచేసింది. మంచి చెడ్డలు లేక నోటికి వచ్చినటులెల్ల మాటాడిన దురహంకారి నామునీంద్రుడు "పిశాచము లైపో" మ్మని శపించాడు. శాపవచనము లాలకించిన విప్రాంగన గడగడ

లాడుచు "శాపవిమోచన మార్గం బెరిగింపు" మని వేడుకుంది. కౌండవ్యముని దయగలవాడై "అమ్మా! నీవీ శాపవశమున పిశాచరూపమును పొంది కొంత కాలంబునకు అగస్త్యమున్యాశ్రమంబును చేరగలవు. ఆ సమయంబున మును లందరును చేయుచున్న యాగదూపము నీకు తగిలినంతనే తిరిగి నీయీ రూపము నీకు రాగల" దని చెప్పాడు.

విప్రాంగనకు సంక్రమించిన పిశాచి స్వరూపము నల్లగనున్నందున నిప్పుడామెకు "నీల" యను పేరు వచ్చింది. కొంతకాలంబున కానీల అగస్త్య మున్యాశ్రమంబున కేతెంచుటయు, యజ్ఞధూపమున శాపవిముక్తి పొందుటయు గూడ జరిగినై. జరిగిన దానికై చింతించుచు నొక చోట నీల కూర్చుండి యుండగ నదీస్నానము చేసి వచ్చుచున్న అగస్త్యముని యీమె మంచి చెడ్డల నన్నింటిని విచారించిన పిదప నూరడించాడు. నీల భక్తి వినయంబుల మునికి నమస్కరించి "మహాత్మా! గతమునకై చింతింప నేల! ఇకముందు నేనెటువంటి పతనావస్థను నొందక కైవల్యము నొందదగిన మార్గం బెరి గింపు" మని ప్రార్థించింది.

అంతనామునియు సంతసించి "అమ్మాయి! ఇప్పటి నీయీ యోచన నాకు నచ్చింది. నీకు భైరవమంత్రముపదేశించెద. మా యజ్ఞము ముగియు వరకు నీవిందేయుండుము. తరువాత కర్తవ్యము నీకు బోధపడ గల"దంటూ

మంత్రోపదేశం చేశాడు. నీలయు సమీపమునంగల నదీతీరమున స్నానములు సేయుచు మునులిచ్చిన తీర్థప్రసాదంబుల భక్తి శ్రద్ధలతో పుచ్చుకొనుచు మనంబున దైవభక్తి కలిగి భైరవమంత్రమును జపించుచుండ కొలది దినంబులలోనే నీలకు భైరవస్వామి సాక్షాత్కరించి "భక్తురాలా! నీకు చేపడ గల మార్గమెరింగించెద నా వెంట రమ్మని దక్షిణకైలాసంబునను గొనిపోయి వాయులింగమును చూపి నీవీ స్వామిని సేవింపు చుండుము. నేను మరల వచ్చెద"నని చెప్పి వెళ్ళిపోయాడు.

నీల జ్ఞానప్రసూనాంబా కాళహస్తీశ్వర స్వాముల వారిని సేవించుచుండగ పదునాలుగేండ్లు గడపింది. శంకర సాక్షాత్కారమున కామె యారాటపడు చున్నందున నొకదినంబున పద్మాసనంబున గూర్చుండి యోగాభ్యాసమున ప్రాణవాయువులను బ్రహ్మకపాలమునకు చేర్చి దేహత్యాగ మొనరించింది. అంత నా క్షేత్రపాలకుడైన కాళహస్తీశ్వరుడు ప్రత్యక్షమై మంత్రజలములచే నామెను బ్రతికించి "కుమారీ! నీకు కైవల్యము సిద్ధింపనున్నది. నీకు నేను మంత్రము లందెల్ల మణివంటి మంత్రము నుపదేశించెద. దానిని జపింపుము. నేనిచట నిన్ను బ్రతికింప నీపైచల్లుటకుగాను నిర్మించిన ఈ కొలను కర్ణిక యనునామంబున ప్రకాశింపగలదు. మణివంటి మంత్రమును గూడ పొందు చుంటివి కావున ముందిది మణికర్ణిక తీర్థంబను పేర పవిత్రము కాగల"దని చెప్పి యా లింగము నందైక్య మొందాడు.

# తత్త్వ ప్రకాశిక తీర్థ ప్రభావము

పూర్వమొకప్పుడు కైలాస పర్వతము మీద పార్వతీ సహితంబుగ పరమేశ్వరుడు సభదీరి కూర్చున్నాడు. సభానంతరం నారదమునికి కొన్ని ధర్మసందేహాలు కలిగినై. వెంటనే బ్రహ్మలోకానికి పోయి కమలాసనునితో "నాన్నగారూ! సర్వాధికారియైన సాంబశివుడు బిచ్చమెత్తు కొనుటేమి? ముసలియెద్దు నెక్కుటేమి? రుద్రాక్షలు ధరించుటేమి? బూడిద పూయుటేమి? పులపుర్రె చేతబట్టుటేమి? ఏనుగు తోలు గట్టుటేమి? ఈ వివరములు నాకు తెలియ చెప్పండి" అని అడిగాడు.

బ్రహ్మదేవు డందులకు చిరునవ్వు నవ్వి కుమారా! శివతత్త్వమును గురించి తెలిసికొన దలంచిన నీవు ధన్యుడవు. కాని అనంతుడు అనంత శక్తి సంపన్నుడు. అనంత మహిమ గలవాడు నైన ఆదిశంకరుని గురించి సవిస్తరంబుగ నెఱింగింప నాకు శక్తి చాలదు. నీవు శివానుగ్రహమున బ్రహ్మజ్ఞాన మొందితి వేని శివతత్త్వము బోధపడ గల" దని చెప్పాడు. నారదముని తండ్రి యనుమతి పొంది దక్షిణ కైలాసంబున కరుదెంచి, ముందుగ సువర్ణ ముఖియందు స్నాతుడై కైలాసనాథ లింగమును సేవించిన తరువాత నీశాన్య

ముగ నున్న విద్యాపీఠ మనం బడు శిఖరము నెక్కి కుమారస్వామిని ప్రార్థిం చుచు కొంత కాలం గడిపాడు.

ఒకనాడు బ్రహ్మమానస పుత్రునకు దర్శనం బిచ్చిన కుమారస్వామి "మునీంద్రా! నేను నీమనంబున గల సందేహంబుల దీర్చవచ్చాను. సాంబశివుడీ విశ్వమున కంతకును కర్త భర్త హర్తయునై యున్నాడు. శివునకు మూడవ నేత్రమున్నది. దానినే యుపనయన మంటారు. ఉపనయన మంటె అదనముగ నున్న కన్నని అర్థం. అదేజ్ఞాననేత్రం. జ్ఞానజ్యోతిని దర్శించుటకే పెద్దలు ఉపనయన సంస్కారం గావించుచున్నారు. దానికి గుర్తు జందెం గాయత్రీ మంత్రోపదేశం పొందిన కటువు "భవతీ భిక్షాం దేహి—భవాన్ దేహి" యంటూ సంచరించి విద్యాభ్యాసం చేయడం వైదికధర్మం. కనుక పరమేశ్వరుడీ వైదికాచారాన్ని ప్రప్రథమంగా నెరపిన వాడైనందున వాని కాదిభిక్షుకుడనే పేరు వచ్చింది.

ఆయన ఎద్దునెక్కుట యందును విశేషము లేకపోలేదు. శివుడను పద మునకు ఐశ్వర్యము కలవాడని యర్థం. ప్రపంచమున పాడిపంటలు కలవారు భాగ్యవంతులు. పాడిపంటలకు వ్యవసాయము మూలము. వ్యవసాయ దారునకు ప్రధాన సాహాయ మొనరించునది యెద్దు. కావున మహేశ్వరుడు వృష

భవాహనుండగుట ప్రకృతికి సంబంధించిన భావం. ఇకదానినే పౌరాణికంగా చూచితే ప్రళయకాలంబున పరమేశ్వరుడు దప్ప సర్వం నశించిపోతుంది. అప్పుడు ధర్మదేవతకు నేనును నాశనమొందుదునేమో నను భయముదోచి. శంకరుని సమీపించి "దేవా! నేను వృషభమునై మీకు వాహన మయ్యెదను. నన్నపుడు మీరు సర్వవేళల సర్వావస్థలందును ధర్మమార్గము నందే నడిపింపుడంటూ వృషభరూపం ధరించింది. శంకరుడు నందివాహనుండనగ ధర్మము దప్పక సంచరించువాడని యర్థం.

రాజాధిరాజులైనా—నిరుపేదలైనా—మీ ఈ శరీరముల నెంత పాలు పాయసాలతో పెంచినా-రత్నహారాలచే నలంకరించినా చివర కొకనాడు మీరీ శ్మశానమునకు రాక తప్పదు—యిట్లు బూడిద గాక తప్పదను వైరాగ్యమున గాని మానవుడు ధనీషణ—దారీషణ—పుత్రీషణ లను మూడు వ్యామోహముల నుండి విముక్తి పొందడని చెప్పుటకే వల్లకాటి బూడిదను తాను మేన పూయుచున్నాడు.

అతడు మృత్యుంజయుండు. కాలకూట విషమైనను నా కపకారము చేయదనియే పాముల ధరించాడు. అదిగాక రుద్రాక్షలందు ఏకముఖి ద్విముఖి త్రిముఖి చతుర్ముఖి పంచముఖి యను రకములు గలవు. ఓషధులం దుత్తమమైన రుద్రాక్షల ప్రభావమును లోకంబున కెరింగించుటకే రుద్రాక్షమాలల ధరించు చున్నాడు.

నారాయణుడు హిరణ్యకశిపుని చంపిన తరువాత తన నారసింహావతార మున లోకములకు భయమును కలిగించాడు. అప్పుడు మునులంతా నరసింహ రూపమును సంహరించి మాబాధల దీర్చుమని శంకరుని ప్రార్థించారు. శివుడంతట నరసింహమును పట్టి వధించి వాని చర్మమును దీసి వస్త్రముగా ధరించి దారుకా వనంలో నృత్యం చేస్తున్నాడు.

సమ్మోహనమూర్తియై నయనానంద కరంబుగ నృత్యము సేయుచున్న శంకరుని చూచినంతనే మునిపత్నులంతా మోహపరవశు లయ్యారు. సిగ్గులజ్జాభిమానము లైనను లేక మగలకు భయపడక తెగించిన తమభార్యల కామచేష్టల గాంచి మునులంతా కోపంబున శంభునంత మొందించా లనుకొని ఒక మహాయజ్ఞం చేశారు. యజ్ఞహోమం నుండి అవతరించిన మూర్ఛతో మునులు నీవు పోయి ముక్కంటి చంపిరమ్మన్నారు. ఋషుల యాదేశానుసారముగ హరునంత మొందింప సమీపించిన మూర్ఛనే కాలాంతకుండ పట్టి పాదము క్రింద త్రొక్కిపెట్టాడు. అదిచూచిన మునులు మళ్ళీ హోమంనుండి పుట్టివచ్చిన లేడిని శంభునిమీద కంపగ సాంబశివుడు దానిని బొమ్మనుచేసి చేతధరించాడు. మూడవ మారా హోమము నందుదయించిన పులిని మునులు మహాదేవుని మీదికి పంపకం చేయగ మహేశ్వరుడా పులిని తోలువొలిచి మొలధరించాడు. తాపసులట్లు తమ తపఃప్రభావంబున నావిర్భవింప చేసిన భయంకర మారణాయుధాలన్నీ పరమేశ్వరుని వశమయ్యాయి.

నారదా! ఇట్టులా శివతత్త్వమును గురించి యెంత చెప్పినను సమగ్రముగా చెప్పగలవారము కాకపోయినను నాచేతనైనంతగ చెప్పితి "ననినంత నాసంయమి చంద్రుండును "పోనిమ్ము కొంతవరకైనను శివస్వరూపమును గురించి తెలిసికొంటి" నని తృప్తిచెంది, కుమారస్వామి కభివందనము లాచరించిన తరువాత శంకర మాహాత్మ్యమును కొనియాడుచు లోకసంచారానికి బయలుదేరాడు.

# కోదండరామ తీర్థ ప్రభావము

త్రేతాయుగంలో అయోధ్యానగరం పాలించిన దశరథ మహారాజ కుమారుడు శ్రీరాముడు. శ్రీరాముని తమ్ములు అందరు మంచి నడతలు గలవారు. భార్య సీతాదేవి మహాపతివ్రత. శ్రీరాముడు కారణాంతరములచే పదునాలుగేండ్లు దండకారణ్యంలో నివసించ వలసి వచ్చింది. అప్పుడాయన వెంట తమ్ముడు లక్ష్మణుడు—భార్య సీతకూడ వున్నారు. వారు ముమ్వురూ పంచవటి యనేచోట పర్ణశాలలో కాపుర ముంటున్నారు.

ఒకనాడు రామలక్ష్మణులు పర్ణశాలలో లేని సమయం చూచి లంకానగరమేలే రావణుడు దొంగతనంగ వచ్చి సీత నెత్తుకుని పోయి తన రాజ్యమందలి అశోకవనంలో బంధించి వుంచాడు. తరువాత పర్ణశాలకు తిరిగి వచ్చిన రామలక్ష్మణులకు సీత కనపడలేదు. వారా యడవి నంతా వెదికి వెదికి చివరకు జానకిని రావణుడెత్తుకొని పోయిన వార్త తెలుసుకున్నారు. లంక సముద్రంలో వున్నది. లంక నన్నివైపులా యమదూతల లాంటి రాక్షసభటులు కావలా గాయుచున్నారు. రాక్షసు లందరూ మహాక్రూర కర్ములు. వారందరకూ మంత్రాలు వచ్చు—తంత్రాలు తెలుసు—యింద్ర మహేంద్ర జాలం లాంటి గారడి విద్యలలో ఆరితేరినవారు. పక్షులు గాలిలో యెగిరి పోవునట్టులనే గగనమార్గాన సంచరించే సూత్రాలు గూడ తెలిసిన వారైనందున వారిని జయించడమంటె సామాన్యమైన పనికాదు.

అక్కడక్కడా తిరిగి వేసారిపోయిన రాముడొకనాడు అగస్త్యమునితో తన పరిస్థితి నంతా చెప్పుకున్నాడు. రాముడంటె మునుల కంతులేని ప్రేమాభిమానాలు. నిజం చెప్పాలంటే మనదేశానికి నడిసముద్రంలో నూరు యోజనాల దూరాన నున్న లంకానగరం చేరడానికి గూడ ఉపాయం తోచడంలేదు. కొంచెం సేపాలోచించిన అగస్త్యముని "రామచంద్రా! శంకరానుగ్రహమున గాక నీవు విజయం సాధింపనేరవంటూ శివపంచాక్షరీ మంత్రోపదేశం చేస్తూనే వానిచేత నొక శివలింగ ప్రతిష్ఠ గూడ చేయించాడు.

శ్రీరాము డంతట ప్రతిదినము నదీస్నానము సేయుచు, అగస్త్యుం డుపదేశించిన మహామంత్రమునే జపించుచు ముని చంద్రుల వలన శివలీలల నాలకించుచు లక్ష్మణునితో గూడ మున్యాశ్రమము నందే యుండగ నైదవ దినంబున శంకరుడు సాక్షాత్కరించి "రాజకుమారా! నీకు కావలసిన దేమి!" యనగ రాముడా నందివాహనునకు నమస్కరించి "ముకుంద ప్రియా! దయామయా! రావణాసురుండు నాభార్య నపహరించుకుని పోయినాడు. నేను క్షత్రియ ధర్మంబుగ శత్రు సంహారము చేసి సీతాదేవిని చెర విడిపించుకొన దగినవాడనై యున్నాను. కావున నాకా రావణవధ చేయగల శక్తి సామర్ధ్యంబుల ప్రసాదింపు" మని వేడుకున్నాడు. శంభు డందులకు సమ్మతించి "రాజకుమారా! ముందు నీకు నాయంశచే జన్మించిన ఆంజనేయుండు నమ్మినబంటు కానున్నాడు. అనంతరమున గౌతమనందనుండైన సుగ్రీవుని సాహాయము నీకు లభింప నున్నది. అటు పిమ్మట విశ్వకర్మ కుమారులైన నలనీలాచార్యులు నీకాప్తు లయ్యెదరు. నీవు విజయం సాధింపగల" వని యాశీర్వదించాడు.



దైవబలంబున రాముడు లంకకు పోయి రాక్షసులను చంపి సీతతో గూడ తిరిగి వచ్చేటప్పుడు సముద్రమున కీవల తీరమున శివలింగ ప్రతిష్ఠ చేసి పూజించాడు. నాడు రామ ప్రతిష్ఠగ రూపొందిన లింగములు రామలింగే

శ్వర లింగమనుచు భక్తాదులు దర్శించు చున్నారు. ఆలింగమున్న ప్రదేశమునకు రామేశ్వర మని పేరు. రామేశ్వరము మనకు మహా పవిత్రస్థలం. విజయము పొంది అయోధ్యకు చేరిన రామభద్రుడు రాజ్యపట్టాభిషేకం చేసుకున్నాడు. రాజసూయ మహాయజ్ఞం చేశాడు. తమ్ములందరి కుమారులకు గూడ రాజ్యాలను సంపాదించి యిచ్చాడు. రామ పాలనకు రామరాజ్యం అనే కీర్తి వచ్చింది.

రామావతారమున తా నొనరింప దగిన పనులన్నియు పూర్తిగావించిన తరువాత దక్షిణకైలాసమునకు పోయిన రామప్రభువు కుమారస్వామి విద్యా పీఠమునకు పశ్చిమ భాగంబున సువర్ణముఖితో రామతీర్థంబను నొక తీర్థంబును గల్పించి భక్తివిశ్వాసంబుల నారాధించుచుండ వానికి కుమారస్వామి ప్రసన్నుడై శివతత్త్వ మహాత్మము నామూలాగ్రముగ బోధించాడు. తరువాత స్కంధుండు నిర్ణయించిన చందంబున శ్రీరాముడు వల్మీక క్షేత్రము నందును లింగప్రతిష్ఠ చేసి వైభవోపేతంబుగ తిరిగి యయోధ్య కేతెంచి సకలైశ్వర్యముల ననుభవించాడు.

## సువర్ణముఖీ ప్రముఖ నామములు

సువర్ణముఖి:— బంగారు చాల గలదియు—దేవదానవమాన వాదులందరి చేతను బంగారము వలె నాకర్షింప బడుచున్నందున సువర్ణముఖీ నది యైనది.

అగస్త్య గిరిజా:— అగస్త్య పర్వతము నందుదయించినది.

బ్రహ్మ పేరితా:— బ్రహ్మ ప్రోత్సహింపగా ప్రవహించుచున్నది.

అగస్త్యనందిని:— అగస్త్య మహాముని కుమార్తె.

వియద్గంగా:— ఆకాశము నుండి దిగివచ్చినది.

పావనీ:— భక్తులను పవిత్రము చేయగలది.

వేగవతి:— శీఘ్రమైన నడక కలది.

యశస్వనీ:— కీర్తితో ప్రకాశించుచున్నది.

మొగలేరు:— పూర్వమీనది కిరువైపులందు మొగలి పొదలున్నందున మొగలేరనియు ప్రసిద్ధి కెక్కినది. మఱియు నీనది కనేక నామము లున్నవి.

శ్రీకాళహస్తి మహాప్రభావం గల పుణ్యక్షేత్రము. శివక్షేత్రములలో ప్రముఖమైనది. దక్షిణ కైలాసమని ప్రఖ్యాతి గాంచినది. దేవతలు గూడ శ్రీ

హస్తీశ్వరుని సేవించి మహోన్నత దశల పొంది యున్నారు. సాలెపురుగు-పాము—ఏనుగు మొదలైన క్రిములకు జంతువులకు మృగములకే గాక మానవులకు, మునులకు, దేవతలకు గూడ వరదుడైన జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీకాళహస్తీశ్వర స్వామి దయామయుడు. సర్వజనులచే సేవింపదగిన దైవము. ఆ క్షేత్రము సాటిలేని పుణ్యస్థలము.

